# పశుగణాభివృద్ధి

## కీలక గ్రామ పథకం

పశుగణాభివృద్ధికోసం నిర్ణీత ప్రాంతాలలో తీవ్రకృషి చేయటానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకంక్రింద నాసిరకం ఎద్దులకు విత్తుకొట్టడం, కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాల నియంత్రణ క్రింద పశువుల ఉత్పత్తి కార్యక్రమాన్ని అమలుజరపటం, సబ్సిడీ పద్ధతిపై దూడలను పెంచడం, సహకార పద్ధతులపై పశుగ్రాస వనరులను అభివృద్ధిపరచడం జరుగుతుంది. 1957—59 సంవత్సరాలలో 10 కీలకగ్రామ కేంద్రాలు ఆంధ్రలో స్థాపించబడినాయి ఇంకా 9 కేంద్రాలను ప్రారంభించటానికి, యిప్పుడున్న వాటిని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 11.107 లక్షలమొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.423 లక్ష యీ జిల్లాలోవున్న ఒక పాత కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## గోశాలల అభివృద్ధి

గ్రాంట్-ఇన్-ఎయిడ్ (ఆర్థికసహాయం) యివ్వడంద్వారా గోశాలలను అభివృద్ధి చేయడానికి యీ పథకం ఉద్దేశించబడింది. 1959—60 లో 4 క్రొత్త గోశాలలకు, 5 పాత గోశాలలకు గ్రాంట్-ఇన్-ఎయిడ్ యివ్వటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.81 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.165 లక్ష యీ జిల్లాలోని ఒక గోశాలకు గ్రాంట్-ఇన్-ఎయిడ్ యివ్వటానికిగాను ప్రత్యేకించబడింది.

## జంగమ పశు కాపర్లకు పునరావాసం కల్పించటం

కర్నూలు జిల్లాలోని సుగాలీలు పశుకాపర్లుగా ప్రసిద్ధిచెందారు. నల్లమల్ల కొండల ప్రాంతాలలో నివసించే వీరికి పశువులను పెంచటమే ముఖ్యవృత్తి. మేలురకం పశువులను పెంచేటందుకు వీరిని ప్రోత్సహించే నిమిత్తం 1959—60 లో 14 ఒంగోలు ఆబోతులను, ప్రథమ చికిత్సా పరికరాలను వీరికి పంచటానికి ప్రతిపాదింపబడింది. ఇంతేకాక వీరికి సాంకేతికసలహాల వివ్వటం కోసం తగుమాత్రం సిబ్బంది కూడ నియమించబడుతుంది. ఈ పథకంకోసం 1959—60 ప్రణాళికలో రు. 0.25 లక్ష కేటాయించబడింది

## జిల్లా, రాష్ట్ర పశుప్రదర్శనాలు

పశువుల పెంపకందార్లకు ఉత్సాహం కలిగించటానికి, శాస్త్రీయ పద్ధతులలో పశువులను పెంచటం, మేపడం, నిర్వహించడం గురించి జనసామాన్యానికి తెలియజెప్పటానికిగాను రాష్ట్ర, జిల్లా పశుప్రదర్శనలను ఏర్పాటు చేసేటందుకు యీ పథకం క్రింద తలపెట్టబడింది. ఒక రోజుపాటు జిల్లా స్థాయిలో 8 పశు ప్రదర్శనలను ఏర్పాటు చేయుటకుగాను 1959—60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 0.104 లక్ష కేటాయించబడింది.

## కోళ్ళ పరిశ్రమ విస్తరణ అభివృద్ధి కేంద్రాలు

భారత ప్రభుత్వం వారిచే ప్రారంభించబడిన పైలట్ ప్రాజెక్టు అభివృద్ధి పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలో 12 కోళ్ల పరిశ్రమ విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు 1957—59 లలో ప్రారంభించబడినాయి. 1959—60లో యింకా 4 కేంద్రాలను ప్రారంభించటానికి, యింతకుముందు ప్రారంభించినవాటిని కొనసాగించటానికిగాను ప్రతిపాదింపబడింది. ఇందుకు ప్రణాళికలో రు. 2.76 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0 104 లక్ష యీ జిల్లాలో ఒక విస్తరణ కేంద్రాన్ని కొనసాగించేటందుకుగాను ప్రత్యేకించబడింది.

## తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతంలో పశుగణాభివృద్ధి క్షేత్రం స్థాపన

పశుగణాభివృద్ధికోసం తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతంలో బనవాసివద్ద 1956 లో పశుగణాభివృద్ధి - పాడి క్షేత్రం ఏర్పాటు చేయబడింది దీని కొనసాగింపుకు 1959—60 ప్రణాళికలో రు 0.59 లక్ష కేటాయించబడింది.

## వివిధ రకాల పశువుల సరఫరా

స్థానిక పశుగణం స్థాయిని పెంచే ఉద్దేశంతో ఆబోతులను, దున్నపోతులను, మేకపోతులను, మేకలను, పోతు పందులను, ఆడపందులను, పొట్టేళ్లను విదేశీరకం కోడి పుంజులు, పెట్టలు, గ్రుడ్లను తక్కువ ధరలకు రైతులకు

రెండవ ప్రణాళికా కాలంలో అమలు చేయుటానికి ప్రతిపాదింపబడింది. ఆబోతులు కొన్నధరలో సగం ధరకు శస్త్రీకరించి యిచ్చి సరఫరా చేయబడతాయి. 1959—60 లో యీ జిల్లాలో సరఫరా చేయుటానికి ఉద్దేశించబడిన పశువుల సంఖ్య, అందుకయ్యే ఖర్చు వివరాలు క్రింద యివ్వబడినాయి.

| | | సంఖ్య | కేటాయించబడిన మొత్తం (రూపాయల లక్షలలో) |
|---|---|---|---|
| 1 | ఆబోతులు | 16 | 0.168 |
| 2. | దున్నపోతులు | 19 | 0.200 |
| 3. | మేక పోతులు | 14 | 0.014 |
| 4. | ఆడ మేకలు | 20 | 0.018 |
| 5. | పోతుపందులు | 10 | 0.238 |
| 6. | ఆడ పందులు | 4 | 0.010 |
| 7. | పొట్టేళ్లు | 10 | 0.010 |
| 8. | విదేశీ కోడిపుంజులు | 320 | 0.036 |
| 9. | కోడిపెట్టలు (విదేశీరకం) | 320 | 0.036 |
| 10. | గ్రుడ్లు విదేశీరకం | 600 | 0.006 |

## ఉన్ని ప్రదర్శన యూనిట్ల ఏర్పాటు

ప్రస్తుతం అనంతపురం, నెల్లూరు, కాకినాడలలో మూడు ఉన్ని ప్రదర్శన యూనిట్లు పని చేస్తున్నాయి. గొర్రెలను మేపటం, పెంచటం, నిర్వహించటానికి సంబంధించిన విషయాలను గురించి యీ యూనిట్లు ప్రచారం చేస్తాయి. ప్రతి యూనిట్టు ఒక వెటర్నరీ అసిస్టెంటు సర్జను, ఇద్దరు స్టాక్ మెన్ల అజమాయిషీ క్రింద నిర్వహించ బడుతున్నది. 1959—60 తో ప్రస్తుతమున్న మూడు యూనిట్లకు అవసరమైన సిబ్బందిని నియమించడానికి, నంద్యాల, విజయవాడ, విశాఖపట్టణం, అదోని పట్టణాలలో యింకా 4 క్రొత్త యూని

ట్లను ఏర్పాటు చేయటానికి, యింతేకాక అదనంగా మినిస్టీరియల్ సిబ్బందిని నియమించటంద్వారా షీప్ అండ్ గోట్ డెవలప్ మెంట్ ఆఫీసరు కార్యాలయాన్ని పటిష్ఠం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.94 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0-374 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## మహానందిలోని ప్రభుత్వపశుగణాభివృద్ధిక్షేత్రానికి అదనపుసిబ్బంది నియామకం, అభివృద్ధిపనులు

ఒంగోలు, దున్నడ, గిర్ మొదలైన జాతులకుచెందిన మేలురకం ఆబోతులను రాయలసీమ జిల్లాలకు సరఫరాచేయటంకోసం మహానందిలో ఉన్న పశుగణాభివృద్ధి క్షేత్రంలో యీ రకాలపశువులు పెంచబడుతున్నాయి. ప్రస్తుతం యీ క్షేత్రం యింకా నిర్మాణదశలోనే ఉన్నది. పశువులకుగాని, కార్యాలయానికిగాని సిబ్బందికిగాని ఇంతవరకు శాశ్వతమైన భవనాలు నిర్మించబడలేదు. పశుగ్రాసపువంటలు పెంచటానికి తగిన సౌకర్యాలను కలిగించేటందుకు భవనాలునిర్మించడానికి, గెజిటెడ్ సూపరింటెండెంట్ తో సహా అదనపు సిబ్బందిని నియమించటానికిగాను 1959—60లో రు 0.91 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది.

## పశువైద్యశాఖ ప్రధానాకార్యాలయానికి, జిల్లాపశువైద్య కార్యాలయానికి అదనపుసిబ్బంది నియామకం

పశు వైద్యశాఖలో పని బాగాపెరిగిపోయింది. ఈ పనిని నిర్వహించటం కోసం పశు వైద్యశాఖ ప్రధానకార్యాలయాలలోను, చింతలదివిలోని ప్రభుత్వ పశుగణ క్షేత్రంతోసహా జిల్లా పశువైద్య కార్యాలయాలలోను, అదనపు సిబ్బందిని నియమించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959_60 ప్రణాళికలో రు. 0.72 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0-066 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## రిండరుపెస్టువ్యాధి నిర్మూలనపథకం

దేశంలో రిండరుపెస్టువ్యాధిని (గాళ్లవ్యాధిని) నిర్మూలించేటందుకుగాను భారత ప్రభుత్వంవారు వ్యాధిరాకుండా నివారించేటందుకు పశువులన్నిటికి

టీకాలను వేసేకార్యక్రమం ఒక దానిని ప్రారంభించారు. ఈ టీకాలు వేసే ఉద్యమంక్రింద టీకాలు వేయబడకుండా వదలి వేయబడినట్టి పశువులకు టీకాలు వేసేనిమిత్తం గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలకు సంబంధించి ఇంకొకపథకం మంజూరు చేయబడింది. రిండరుపెస్టు వ్యాధి నివారణకు కావలసిన టీకాలమందు మొదలైనవి లభ్యంకాకపోవడం వంటి కొన్ని చిక్కులకారణంగా టీకాలు వేసే కార్యక్రమం పూర్తికాలేదు. ఇందువల్ల పై జిల్లాలలో ఈ రెండు పథకాలను కొనసాగించటానికి తలపెట్ట బడింది. మొదట ప్రారంభించబడిన పథకం కృష్ణానదికి ఉత్తరాన ఉన్న జిల్లాలో ఈ సంవత్సరం పూర్తి అవుతుంది అయితే ఈ జిల్లాలలో కూడా కొన్నిటికి టీకాలు వేయబడకుండా ఉండవచ్చు. అందువల్ల ఈ జిల్లాలలో కూడా ఈ రెండవ పథకాన్ని ప్రారంభించటానికి ప్రతిపాదించబడింది. ఈ పథకం అమలు జరవటం కోసం 1959–60 ప్రణాళికలో రు. 1.95 లక్షలమొత్తం కేటా యించబడింది. ఇందులో రు. 0.164 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## క్లినికల్ లేబరేటరీలను స్థాపించటం

రసాయనిక పరీక్షలద్వారా సకాలంలో వ్యాధులను కనిపెట్టి నిర్ధారణ చేయటంకోసం జిల్లా ప్రధాన పశువైద్య ఆసుపత్రులతోను, రాజ్యంలోని పశు గణాభివృద్ధిక్షేత్రాలలోను క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటు చేయటానికి ప్రతి పాదింపబడింది. విశాఖపట్టణం, కాకినాడ, నెల్లూరు, చిత్తూరు, కర్నూలలో ఉన్న ప్రధాన పశువైద్య ఆసుపత్రులలో 5 క్లినికల్ లేబరేటరీలు ఏర్పాటు చేయబడినాయి. 1957—58 లో పశ్చిమ గోదావరి, కృష్ణ, అనంతపురం జిల్లాలలో ఇంకా 3 క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటుచేయడానికి, ఇంతకు ముందు ప్రారంభించబడిన పాత లేబరేటరీలను కొనసాగించడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు ప్రణాళికలో రు. 0.89 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.034 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## సంచార పశు వైద్యదళాలు, పశు ప్రథమ చికిత్సా కేంద్రాలు, చిన్నతరహా పశువైద్య దళాలు, పశువైద్యఆసుపత్రులను ఏర్పాటు చేయటం

గ్రామీణ, పట్టణప్రాంతాలలోని పశువులకు వైద్య సహాయం అందజేయు డానికి, అంటువ్యాధులను సమర్థవంతంగా నిరోధించటానికి ఈ పథకం ఉద్దేశిం

చబడింది. ఈ జిల్లాలో 1959—60 లో ఒక సంచార పశు వైద్యశాలన్ని 4 పశు ప్రథమచికిత్సా కేంద్రాలను, ఒకచిన్నతరహా పశు వైద్యశాలను, ఒక పశు వైద్యశాలను, రు 0 43 లక్ష ఖర్చుతో ప్రారంభించటానికి ప్రతిపాదించ బడింది. ఇంతేకాక ఇంతకుముందు ప్రారంభించబడిన పశువైద్య ఆసుపత్రులను, సంచార వైద్యశాలను, పశు ప్రథమచికిత్సా కేంద్రాలను కొనసాగించేటందుకు కూడ ప్రతిపాదించ బడింది.

### జిల్లా పశువైద్యశాఖాధికార్లకు జీపులసరఫరా

జిల్లా వైద్యశాఖాధికార్లు తరచుగాను, అకస్మాత్తుగాను తమ క్రింది సిబ్బంది పనిచేసే తావులకు వెళ్ళి వారు చేసేపనిని తనిఖీచేసి వారిని అప్రమత్తులుగా ఉంచాలంటే పై అధికార్లు జీపులను కలిగియుండటం ఎంతైనా అవసరం. అందువల్ల 1959—60 ప్రణాళికలో రు. 0.54 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0 029 లక్ష ఈ జిల్లాలోని జీపు నిర్వహణకుగాను ప్రత్యేకించ బడింది.

### వెటిరినరి కాంపౌండర్లకు శిక్షణ

వెటిరినరి కాంపౌండర్ల కొరతను తీర్చుటంకోసం 1959—60 లో 360 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వటానికి ప్రతిపాదించబడింది. రెండు జట్లుగా 6 కేంద్రాలలో ఈ అభ్యర్థులకు శిక్షణ ఇవ్వబడుతుంది. ప్రతి కేంద్రంలోను 60 మంది అభ్యర్థులు శిక్షణ పొందుతారు. ఈ పథకంకోసం 1959—60 లో రు. 0 50 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.09 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది. 60 మంది అభ్యర్థుల శిక్షణకు ఈ డబ్బు వినియోగించ బడుతుంది.

## అడవులు

### అడవుల పునరుద్ధరణ.

అటవీశాఖ వారిచే స్వాధీనం చేసికోబడినట్టి ఎస్టేటు, పంచాయితీ అడవుల ఉత్పాదక శక్తిని అభివృద్ధి చేసే ఉద్దేశంతో ఆ అడవులలో పునరుద్ధరణ క్షేత్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ జిల్లాలో 272 ఎకరాల ప్రదేశంలో

పునరుద్ధరణ క్షేత్రాలను వేయుటానికి, పాత క్షేత్రాలను నిర్వహించటానికిగాను ఈ సంవత్సరానికి రు.0.417 లక్ష కేటాయించ బడింది.

## రిజర్వు అడవులలో చెట్టుచేమ నశించిన కొండలమీద అడవుల పెంపకం

భూసారం కొట్టుకొని పోకుండా నివారించే నిమిత్తం యీ పథకం క్రింద రిజర్వు అడవులలో చెట్టుచేమ నశించిన కొండ వాలులలో గట్లువేసే పద్ధతిని అటవీ పెంపక క్షేత్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ జిల్లాలో యింకా 20 ఎకరాల ప్రదేశంలో యీ అటవీ పెంపక కార్యక్రమాన్ని అమలు పరచేటందుకు, పాత క్షేత్రాలను నిర్వహించేటందుకుగాను 1959–60 ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించ బడింది.

## అడవులలో రోడ్లు (మైదానాలలో)

కర్నూలు, కడప జిల్లాలలో ఉన్న నల్లమల్లకొండలలోని లోపట్టు అడవులను వినియోగంలోకి తీసుకరావటం కోసం 1956–57 లో అడవులలో ఉన్న రోడ్లకు అభివృద్ధి పనులు, మరమ్మత్తులు చేయడం, క్రొత్తరోడ్లను నిర్మించడం జరిగింది. ఈ జిల్లాలోని అడవులలో ఉన్న 51 మైళ్ళ రోడ్లను అభివృద్ధి చేయటం కోసం యీ సంవత్సరానికి రు. 2.68 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## కలప రవాణా నిబంధనలను అమలు పరచటం.

కలప అక్రమంగా తరలించుకొని పోబడకుండా నివారించే నిమిత్తం ఒక చోటనుండి యింకొక చోటికి రవాణా చేయబడే కలపమీద కట్టుదిట్టమైన తనఖీ ఏర్పాటు చేయుటానికి యీ పథకం ఉద్దేశించ బడింది. 1959–60 లో ఆంధ్ర లోని అన్ని డివిజన్లలోను 80 మంది కానాదార్లు నియమించ బడతారు. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.35 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.0482 లక్ష యీ జిల్లాలో 11 మంది కానాదార్ల నియామకం నిమిత్తం ప్రత్యేకించ బడింది.

### భవనాల నిర్మాణం.

ఈ జిల్లాలో పనిచేస్తున్న అటవీశాఖ తాజేదారీ సిబ్బందికి నివాస గృహ వసతి లేనందువల్ల యీ పథకం క్రింద రు. 0.15 లక్ష ఖర్చుతో వారికోసం ఈ సంవత్సరంలో 8 నివాస గృహాలను నిర్మించటానికి ప్రతిపాదించ బడింది.

## భూసార రక్షణ

### రిజర్వు అడవులకు వెలుపలనున్న చెట్లు చేమనశించిన కొండలమీద అడవుల పెంపకం.

రాయలసీమ జిల్లాలలో రిజర్వుడు అడవులకు వెలుపల ఉన్న చెట్లు చేమ నశించిన కొండలమీద అడవులను పెంచటానికి యీ పథకం ఉద్దేశించ బడింది. రకరకాల భూసారం వివిధ ప్రాంతాలలో కొట్టుకొని పోకుండా భూసార రక్షణ చర్యలు తీసికోవడమే యీ పథకం యొక్క లక్ష్యం. ఈ జిల్లాలో 80 ఎకరాల భూమిలో అడవులను పెంచటం కోసం ఈ సంవత్సరానికి రు. 0.175 లక్ష కేటాయించ బడింది.

### పది ఎకరాలక్షేత్రాలలో మెట్టసాగు పద్ధతుల్ని వివరించే పైలట్ ప్రదర్శన ప్రాజెక్టులను ఏర్పాటు చేయటం

సొలోపుగట్లు (కాంటూరుబండ్లు) వేసిన ప్రాంతాలలో వ్యవసాయదార్లు మెట్టసాగు పద్ధతుల్ని అవలంబించేటట్టు ప్రోత్సహించేనిమిత్తం వారికి ఎకరానికి రు. 15 లు చొప్పున సబ్సిడీ యివ్వటానికి యీ పథకంక్రింద ఉద్దేశించ బడింది. 800 ఎకరాల ప్రదేశంలో ఏర్పాటు చేయబడే 30 క్షేత్రాలలో మెట్టసాగుపద్ధతుల్ని ప్రవేశ పెట్టేటందుకుగాను 1959—60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 0.049 లక్ష కేటాయించ బడింది.

## మత్స్యసంవర్ధన

### చేపపిల్లల సేకరణ వాటి పంపిణీ.

గోదావరి, కృష్ణనదుల్లోను, తూర్పు, పశ్చిమగోదావరి. కృష్ణా, గుంటూరు జిల్లాలలోని డెల్టా ప్రాంతాల్లో ఉన్న నీటిపారుదల కాలువలలోను

చేప పిల్లలు పుష్కలంగా లభిస్తాయి. చేపల ఉత్పత్తిని ఎక్కువ చేయటంకోసం రాష్ట్రంలోని జలాశయాల్లో నిలువ చేయడానికిగాను చేప పిల్లల్ని అందులోను త్వరగా పెరిగే రకాల్ని, పై [illegible] సేకరించటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. ఈ చేపలు సేకరించ బడే ప్రాంతాలనుండి నిలువ చేయబడే ప్రాంతాలకు పెద్దసరఫరా చేయటంకోసం 1957—58 లో 12 వ్యానులు కొనబడినాయి. ప్రత్యేక సిబ్బందికూడ నియమించ బడింది. ప్రస్తుతమున్న సిబ్బంది సహాయంతోను, వ్యానుల సహాయంతోను 1959-60 లో 2 కోట్ల చేపపిల్లలను సేకరించటానికి ప్రతిపాదించ బడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 1.93 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.05 లక్ష యీ జిల్లాలో 5 లక్షల చేప పిల్లలను సేకరించటానికి గాను ప్రత్యేకించ బడింది.

### చేపల మార్కెట్లు

రాష్ట్రంలో ఉన్న చేపల మార్కెట్లు చాలా వరకు అపరిశుభ్రంగాను, మురికిగాను ఉన్నాయి. చేపల మార్కెట్లను నిర్మించి వాటిని పరిశుభ్రమైన స్థితిలో ఉంచ వలసిన బాధ్యత సామాన్యంగా స్థానిక సంస్థలు, మునిసిపాలిటీలు వహించాలి. అయినప్పటికీ వాటి ఆదాయ మార్గాలు చాలా తక్కువగా ఉన్న కారణం వల్ల మార్కెట్లను నిర్మాణానికి సబ్సిడీల నివ్వటం ద్వారా స్థానిక సంస్థలకు సహాయం చేయటానికి ప్రతిపాదించ బడింది. ఆంధ్ర ప్రాంతంలో 5 పెద్దవి 5 చిన్నవి చేపల మార్కెట్లను నిర్మించటం కోసం స్థానిక సంస్థలకు, మునిసిపాలిటీలకు సబ్సిడీల నివ్వటం కోసం 1959—60 సంవత్సరానికి రు. 1.23 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో ఒక మార్కెట్టును యీ జిల్లాలో నిర్మించుటకు ప్రభుత్వం సహాయం లభిస్తుంది.

## సహకారం, గిడ్డంగులు, మార్కెట్లు.

### గ్రామీణ పరపతి సంఘాల విస్తరణ.

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘం వారు సూచించిన పద్ధతులను అనుసరించి రాష్ట్రంలోని

గ్రామీణ పరపతి సంఘాలను పునర్వ్యవస్థీకరించ టానికి, పటిష్ఠం చేయ, టానికివిస్తరింప చేయటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. సహకార శాఖలో సిబ్బందిని పెంచటంద్వారాను సెంట్రలు బ్యాంకులు, పెద్ద తరహా సంఘాలచే అదనంగా నియమించ బడిన పర్యవేక్షక, నిర్వాహక సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద సహాయం చేయటం ద్వారాను యీ పథకం రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో అమలు జరుప బడింది.

జాతీయ అభివృద్ధి మండలివారు సహకార విధానాన్ని గురించి ఒక తీర్మానాన్ని చేశారు. గ్రామీణులతో సహకార సంఘాల నిర్మాణం జరగాలని అందువారు నొక్కి వక్కాణించారు. ఈ తీర్మానాన్ని పునస్కరించుకొని ఈ సంవత్సరం పెద్ద తరహా సంఘాలను గ్రామీణ బ్యాంకులకు ఏర్పాటు చేయటం నిలుపుదల చేయబడుతుంది అయితే ఆంధ్ర ప్రాంతంలో క్రొత్తగా 350 చిన్న తరహా సంఘాలను ఏర్పాటు చేయటానికి, ప్రస్తుతమున్న 600 చిన్న తరహాసంఘాలను పటిష్ఠం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందువల్ల యీ సంవత్సరం అంతమయ్యేలోగా నూటికి 82 గ్రామాలు, నూటికి 38 మంది గ్రామీణ ప్రజలు సహకార సంఘాల క్రిందకు తీసుక రాబడతారు. 1,020 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు, రు. 100 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలుకూడ యివ్వబడతాయి. పరిపాలన శాఖనుండి ఆడిటు శాఖను విడతీయటానికి సంబంధించిన పథకాన్నికూడ ఈ సంవత్సరంలో అమలు జరపటానికి ప్రతిపాదింపబడింది. రిజిష్ట్రారుకు ఆర్థిక సలహాదారు అని వ్యవహరింపబడే ఒక జాయింటు రిజిష్ట్రారుకూడ ప్రధాన కార్యాలయంలో నియమింపబడతారు. గ్రామీణ పరపతి విస్తరణ పథకానికి సంబంధించిన పనినిమాత్రం యీాయన ప్రత్యేకంగా నిర్వహిస్తారు. ఈ జిల్లాలో అమలు జరుపబడే కార్యక్రమం క్రింది విధంగా ఉంటుంది. 40 చిన్న తరహా సంఘాలు క్రొత్తగా ఏర్పాటు చేయబడతాయి. ప్రస్తుతమున్న 55 చిన్నతరహా సంఘాలు పటిష్ఠం యబడతాయి. పాత సంఘాల్లో 14,600 మంది సభ్యులు, క్రొత్త సంఘాలలో 2,000 మంది సభ్యులు చేర్చుకోబడతారు. రు. 50 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు రు. 10 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలు యివ్వబడతాయి.

పై కార్యక్రమాన్ని అమలు జరపటంకోసం ఈ జిల్లాకు రు. 97,405లు. కేటాయించబడినాయి. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది

| | రూపాయలు. |
|---|---|
| 1. చిన్నతరహా సంఘాలకు సబ్సిడీలు. | |
| (ఎ) 1958—59 లో ప్రారంభించిన సంఘాలకు | |
| (బి) 1959—60 లో ప్రారంభించబడే సంఘాలకు | 6,500 |
| 2. (ఎ) పెద్దతరహా సంఘాలకు సబ్సిడీలు | 18,800 |
| (బి) గ్రామీణ సంఘాలకు సీనియరు ఇనస్పెక్టర్ల నియామకం క్రింద ఖర్చు | 4,100 |
| 3. సెంట్రలు బ్యాంకులకు సబ్సిడీలు. | |
| (ఎ) ఇంతకుముందు నియమించబడిన పాత సూపరు వైజర్లకుగాను | 8,000 |
| (బి) 1559—60 లో నియమించబడే క్రొత్త సూపరు వైజర్లకుగాను | 1,800 |
| 4. అవసరపు సిబ్బందిక్రింద ఖర్చు | |
| (ఏ) ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో పరపతి విస్తరణ కార్యక్రమానికిగాను నియమించబడిన సీనియరు, జూనియరు ఇనస్పెక్టర్లకు | 10,635 |
| (బి) పైలట్ పథకానికిగాను సిబ్బంది నియామకం | 7,000 |
| (సి) పరపతి విస్తరణ కార్యక్రమానికిగాను సహకార సబ్-రిజిస్ట్రార్ల నియామకం | 8,400 |
| (డి) సహకార సబ్—రిజిస్ట్రార్లు (సి. డి.), టైపిస్టులు, జవానుల నియామకం | 15,900 |

| | |
|---|---|
| (ఇ) ఆదోని సర్కిలుకు 1956—57 లో నియమించబడిన ఇద్దరు సహకార సబ్-రిజిస్ట్రార్లకు, ఇద్దరు జవానులకు | 8,000 |
| (ఎఫ్) డిప్యూటి రిజిస్ట్రార్ల సర్కిళ్ళు ప్రతి ఒక్క దానిలోను 1959—60 లో జూనియరు ఇనస్పెక్టరు నియామకానికి | 2,670 |
| మొత్తం | 97,405 |

## భూమి తనఖా బ్యాంకుల అభివృద్ధి

నీటి పారుదల వసతిని కల్పించడం, భూమిని సాగుక్రిందకు తీసుకురావటం మొదలయిన శాశ్వతమైన అభివృద్ధి పనులను భూములలో చేయటంకోసం యీ పథకంక్రింద 25 సంవత్సరాలలో తీర్చుకోదగ్గ దీర్ఘకాలిక ఋణాలు ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులద్వారా రైతులకు యివ్వబడతాయి. రు. 10.00 లక్షల వరకు దీర్ఘకాలిక ఋణాలు ఈ సంవత్సరంలో యీ జిల్లాలో యివ్వబడతాయి. ఈ సంవత్సరానికి యీ జిల్లాకు కేటాయించబడిన రు. 3,700 లు క్రింది విధంగా వినియోగించబడతాయి

| | |
|---|---|
| 1. ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులలో నియమించబడిన అదనపు సూపరు వైజరులక్రింద ఖర్చు | 2,600 |
| 2. ఈ సంవత్సరం నియమించబడే అదనపు సూపర్ వైజరులక్రింద ఖర్చు | — |
| 3. భూమి తనఖా బ్యాంకుల పర్యవేక్షణకోసం నియమించబడే సహకార సబ్-రిజిస్ట్రార్లు వారి జవానులక్రింద ఖర్చు | 1,100 |
| మొత్తం | 3,700 |

## సహకార మార్కెటింగ్ అభివృద్ధి

ఇది కొనసాగులూ వస్తున్న పథకం. వ్యవసాయదారులకు, ముఖ్యంగా చిన్నరకం మధ్యరకం ఉత్పత్తిదారులకు, స్టోరేజి, గిడ్డంగి, మార్కెటింగు సౌకర్యాలను కలిగించడం, తద్వారా వ్యవసాయోత్పత్తులకు సహకార మార్కెటింగు సౌకర్యాన్ని ఇతోధికంగా కలుగచేయడమే యీ పథకం లక్ష్యం. వ్యవసాయోత్పత్తులమీద స్వల్పకాలిక ఋణాలు రైతులకు యివ్వ బడతాయి. ఇంతేకాక మార్కెటింగు సంఘాల ద్వారా రసాయనిక ఎరువులు, అవసరమైనన్ని ఋణిక సామాగ్రి రైతులకు సరఫరా చేయ బడతాయి. గ్రామాల స్థాయిలో పనిచేసే ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాల కార్యక్రమాలకు, మండీ కేంద్రాలలో పనిచేసే మార్కెటింగు సంఘాల కార్యక్రమాలకుమధ్య సమన్వయం చేకూర్చడానికికూడ యీ పథకం ఉద్దేశించబడింది.

ఈ పథకంయొక్క పై లక్ష్యాలను సాధించడంకోసం రెండవ ప్రణా ళికలో ప్రాథమిక మార్కెటింగు సంఘాలను పునర్వ్యవస్థీకరించి, పటిష్ఠం చేయటానికి ఉద్దేశించబడింది. మండీ కేంద్రాలలో ప్రధాన గిడ్డంగులను, గ్రామాల స్థాయిలోని మండీలలో ఉప గిడ్డంగులను నిర్మించటానికి, ప్రత్తి జిన్నులు, నూనె మిల్లులు, చెరకు క్రషర్లు మొదలయిన ప్రాసెసింగు ప్లాంటు లను నెలకొల్పటానికిగాను సంఘాలకు సహాయం చేయటంకోసం రాజ్య ప్రభుత్వం యీ కార్యక్రమాలలో పాల్గొంటుంది. శిక్షణ పొందిన సిబ్బంది సహాయం, ఆర్థిక సహాయంకూడ యీ సంఘాలకు యివ్వబడుతుంది. ఈ సంవ త్సరంలో క్రింది కార్యక్రమం యీ జిల్లాలో అమలు జరుపబడుతుంది.

| | | |
|---|---|---|
| 1. | వ్యవసాయోత్పత్తిపై ఋణాలను యివ్వటం (రూపాయలు,లక్షలలో) | 36·00 |
| 2. | మార్కెటింగు సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 3 |
| 3. | పెద్దతరహా సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 6 |

4. స్థాపించబడే ప్రాసెసింగు ప్లాంటులు (సంఖ్య) 2

పై కార్యక్రమాన్ని అమలు జరపటం కోసం ఈ జిల్లాకు రు. 3.369 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

రూపాయలు లక్షలలో

| | | |
|---|---|---|
| 1. | మార్కెటింగు సంఘాలకు వాటామూల ధనం క్రింద విరాళం | 0.700 |
| 2. | జిల్లా మార్కెటింగు సంఘాలకు వాటా మూలధనం క్రింద విరాళం | 0.250 |
| 3. | ప్రాథమిక మార్కెటింగు సంఘాలయొక్క నిర్వాహక సిబ్బంది ఖర్చుక్రింద సబ్సిడి. | |
| | (ఎ) గత మూడు సంవత్సరాలుగా సిబ్బందిని నియమించిన సంఘాలకు | 0.035 |
| | (బి) 1959—60 లో సిబ్బందిని నియమించే సంఘాలకు | 0.024 |
| 4. | పెద్దతరహా సంఘాలకు గిడ్డంగులు | |
| | (ఎ) గత సంవత్సరాలలో నిర్మాణం ప్రారంభించబడిన గిడ్డంగులను పూర్తి చేయుటకు. | 0.220 |
| | (బి) 1959—60 లో. నిర్మాణం ప్రారంభించబడే క్రొత్తగిడ్డంగులకు | 0.600 |
| 5. | మార్కెటింగు సంఘాలచే గిడ్డంగులనిర్మాణం. | |
| | (ఎ) పాతగిడ్డంగుల నిర్మాణాన్ని పూర్తిచేయుటకు | 0.080 |

(బి) క్రొత్త గిడ్డంగులనిర్మాణానికి 0 750

8. ప్రాసెసింగు ప్లాంటు స్థాపన 0.600

మొత్తం 3.369

## లేబరు కాంట్రాక్టు సంఘాలు, ఫారెస్టు కూప్ సంఘాలు ఏర్పాటుచేయడం

రెండవ ప్రణాళికా కాలంలో 15 లేబరు కంట్రాక్టు సంఘాలను, 15 ఫారెస్టు కూప్ సహకార సంఘాలను ఏర్పాటు చేయటానికి యీ పథకం ఉద్దేశించ బడింది. ఋణాలు, సబ్సిడీల రూపంలో ఆర్థిక సహాయం చేయటం ద్వారా 1957_59 సంవత్సరాల కాలంలో 5 లేబరు కంట్రాక్టు సంఘాలు, 5 ఫారెస్టు కూప్ సహకార సఘాలు ఏర్పాటు చేయబడి, అభివృద్ధి చేయబడి నాయి. 1959_60 లో 5 ఫారెస్టు కూప్ సహకార సఘాలను, 6 లేబరు కాంట్రాక్టు సంఘాలను పునరుద్ధరించి, పటిష్ఠం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందు కోసం ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఈ సహాయం గ్రాంట్ల రూపంలోను, లేబరును సమకూర్చటం ద్వారాను యివ్వ బడుతుంది. ఇందుకు యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.47 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 5,000 లు రాజ్యస్థాయిలో నియమించ టానికి ప్రతిపాదింప బడిన సాంకేతిక సిబ్బంది కోసం ప్రత్యేకించ బడింది. మిగిత రు.0.42 లక్షలో రు. 7800 లు యీ జిల్లాలో ఒక ఫారెస్టు కూప్‌సంఘం, ఒక లేబరు కంట్రాక్టు సంఘం పునరుద్ధరించుటకు గాను ఆర్థిక సహాయం యివ్వటానికి వినియోగింప బడుతుంది. ఇందులో రు. 2,400 లు గ్రాంటుగాను, రు. 5,400 ఋణం రూపంలోను యివ్వబడతాయి.

## పరిశోధన, పరిశీలన, గణాంక వివరాలు.

ఈ పథకం క్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకార శాఖద్వారా అమలు జరుప బడే వివిధ పథకాల మూలంగా ప్రజలకు కలిగిన లాభాలను, ఆ పథకాలను అమలు జరపడంలో తెలియవచ్చినలోటు పాట్లను పరిశీలించడానికి, సూత్రవిధానాలను రూపొందిం

ఏబాసికి సహకార వ్యవస్థలో లోటుపాట్లు ఏమైనా ఉంటే వాటిని సరిదిద్దుకొనే టందుకు మార్గాలను సూచించడానికి యీ ప్రత్యేక విభాగం కృషి చేస్తుంది. 1957—58 లో యీ పథకం అమలు జరప బడింది. గణాంక వివరాల సేకరణ, సంకలనానికి సంబంధించిన పనిని నిర్వహించుటకుగాను జిల్లాలలో 20 మంది సీనియరు ఇనస్పెక్టర్లను నియమించడం, ప్రధాన కార్యాలయంలో ఒక సెక్షను ఏర్పాటు చేయటం జరిగింది. ఈ పథకం 1958—59 లో కొనసాగించ బడింది.

జిల్లాలలో పని చేస్తున్న సిబ్బందికి సూచనలు యివ్వడానికి వారిపై అజమాయిషీ వహించడానికిగాను 1959—60 లో రిజిస్ట్రారు కార్యాలయంలో డిప్యూటీ రిజిస్ట్రారు గ్రేడులో ఒక స్టాటిస్టిషియనును, ఇద్దరు సీనియరు ఇనస్పెక్టర్లు, ఇద్దరు జూనియరు ఇనస్పెక్టర్లు, యిద్దరు జవానులతోకూడిన సిబ్బందిని నియమించడానికి, క్రొత్త సర్కిళ్లకుగాను 12 మంది సీనియరు ఇనస్పెక్టర్లను, ప్రతి సర్కిలుకు ఆఫీసుకు ఒక్కొక్కరు చొప్పున 48మంది తాలూకా డివిజను గుమాస్తాలను నియమించడానికి ప్రతిపాదింప బడింది, క్రొత్త విధానాలను రూపొందించడానికి, వాటిని అమలు పరచుటకు తగిన కార్య విధానాన్ని రూపొందించటానికిగాను సహకారశాఖలో పరిశీలన, పరిశోధన ప్రచార విభాగం ఒకటి ఏర్పాటు చేయబడుతుంది. మొదట యీ విభాగం కోసం ముగ్గురు సహకార సబ్ రిజిస్ట్రార్లను, ముగ్గురు జవానులను నియమించ టానికి ప్రతిపాదింప బడింది. పై కార్యక్రమాన్ని అమలు జరపడం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు 1.70 లక్షల మొత్తం కేటాయించ బడింది ఇందులో రు. 0 34 లక్ష ప్రధాన కార్యాలయంలో నియమించబడే సిబ్బంది ఖర్చు క్రింద ప్రచారం మొదలైన వాటిక్రింద అయ్యే ఖర్చులకుగాను ప్రత్యేకించ బడింది. మిగత రు. 1.36 లక్షల మొత్తంలో రు. 1,08ల లు యీ జిల్లాలో నియమించ బడే సిబ్బంది క్రింద అయ్యే ఖర్చులకుగాను ప్రత్యేకించ బడినాయి.

## సహకార సంఘాల సభ్యులు. పంచాయితీదారులు మొదలైన వారికి శిక్షణ

అఖిల భారత సహకార సంఘంద్వారా భారత ప్రభుత్వంచే ప్రారంభిం చబడిన పథకం పద్ధతుల్లోనే యీ పథకం కూడ రూపొందించ బడింది.

సహకార సూత్రాలను గురించి, నిర్వహణా విధానం గురించి గ్రామీణ పరపతి సంఘాల సభ్యులకు రెండు మూడు రోజులపాటు, పంచాయితీ దారులకు ఒక వారం రోజులపాటు, సంఘాల నిర్వాహకులకు, జీతం చెల్లింపుపై పనిచేసే ఉద్యోగులకు 5 లేక 6 వారాల పాటు శిక్షణ యివ్వటానికి యీ పథకం క్రింద ఉద్దేశింప బడింది. ఈ జిల్లాలో 1,000 మంది సహకార సంఘాల సభ్యులకు, 300 మంది పంచాయతీదార్లకు, 40 మంది కార్యనిర్వాహకులకు శిక్షణ యివ్వటం కోసం 1959—60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 5,856 లు కేటాయించ బడినాయి.

## సహకార వ్యవసాయం.

ఈ పథకం క్రింద భూముల్లేని వ్యవసాయ కూలీలను, సహకార వ్యవసాయ సంఘాలను స్థాపించడం ద్వారా వ్యవసాయంతో స్థిరపడేటట్టుచేసి వారికి పునరావాసం కల్పించటానికి, వాటా మూలధనం క్రింద ఎద్దులను కొనుక్కోవడానికి అయ్యే ఖర్చు క్రింద, భూమిని వ్యవసాయ యోగ్యంగా చేసి అభివృద్ధి పరచడానికి అయ్యే ఖర్చు క్రింద, వ్యవసాయ పనిముట్లను మొదలయిన వాటిని కొనుక్కోవడానికి అయ్యే ఖర్చు క్రింద ఋణాలు, గ్రాంట్ల రూపంలో ఆర్థిక సహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఈ సంవత్సరం ప్రణాళికలో ఆంధ్ర ప్రాంతానికి రు. 1.34 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రు. 0.88 లక్ష-మొత్తం రు. 2.22 లక్షలు కేటాయించ బడినాయి ఇందులో రు. 0.28 లక్ష సహకార వ్యవసాయానికి సంబంధించిన పనిని నిర్వహించటం కోసం హెడ్. ఆఫీసులో నియమించ బడిన సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద వినియోగించ బడుతుంది. మిగత మొత్తంలో రు. 18,500 లు యీ జిల్లాకు ప్రత్యేకించ బడినాయి. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో ఏర్పాటు చేయబడే క్రొత్త సంఘాలకు ఆర్థికసహాయం చేయడానికి యీ డబ్బు వినియోగించ బడుతుంది. ఈ జిల్లాలో 3 క్రొత్త సంఘాలు ఏర్పాటు చేయబడతాయి. 750 మంది సభ్యులు యీ సంఘాల్లో ఉంటారు. ఈ సంవత్సరంలో 1,500 ఎకరాల భూమిసాగు చేయబడుతుంది.

## రాజ్య గిడ్డంగి సంస్థ
## (స్టేటువేరు. హౌసింగ్ కార్పొరేషన్)

దేశంలో గిడ్డంగి సౌకర్యాన్ని అభివృద్ధి చేయాల్సిన ఆవశ్యకతను గురించి అనేక కమిటీలు, కమిషన్లు పలుసార్లు నొక్కి చెప్పాయి. పరపతి

సంఘాలు పరస్పరేతర సంఘాల మధ్య యివి చక్కని సారస్యం వహించేవిగా ఉంటాయి. ఇందువల్ల భారతప్రభుత్వం వారు కేంద్ర గిడ్డంగి కార్పొరేషను నొకదాన్ని ఏర్పాటు చేశారు. ఇందు కనుగుణంగా రాజ్యగిడ్డంగి కార్పొరేషన్లను తమతమ రాజ్యాలలో స్థాపించ వలసిందిగా రాజ్య ప్రభుత్వాలు కోరబడినాయి. ఈ రాజ్య గిడ్డంగి కార్పొరేషనులు గిడ్డంగుల మండలి ప్రత్యక్ష పర్యవేక్షణ క్రింద పనిచేస్తాయి. గిడ్డంగులలో సరకులు నిలువ చేయబడినట్లు. గా యివ్వబడే రసీదులు నెగోషియబుల్ ఇన్స్ట్రుమెంట్లు గా పరిగణించ బడతాయి. గిడ్డంగులలో వ్యవసాయోత్పత్తులను నిలువ చేసిన వారికి పై రసీదుల నాధారం చేసికొని బ్యాంకింగు సంస్థలు ఋణాలను యిస్తాయి. 1958—59లో రాజ్య గిడ్డంగి కార్పొరేషను ఒకటి యీ రాజ్యంలో స్థాపించ బడింది. ఈకార్పొరేషను వాటా మూలధనం క్రింద రాజ్యప్రభుత్వం రు. 2 50 లక్షల మొత్తం యిచ్చింది ఈ కార్పొరేషనుకు వాటా మూలధనం క్రింద యింకా ఎక్కువ డబ్బు సమకూర్చుటకోసం ఆంధ్ర ప్రజానీకంలో రు. 6 లక్షలు, తెలంగాణా ప్రజానీకంలో రు. 5 లక్షలు ఈ సంవత్సరంలో కేటాయించ బడినాయి. ఈ జిల్లాలోని రైతులకుకూడ యీ పథకం క్రింద లభ్యమయ్యే సౌకర్యాలు అందుబాటులో ఉంటాయి.

## జాతీయ విస్తరణ కేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు

1959 వ సంవత్సరం మార్చి నెల అంతంనాటికి యీ జిల్లాలో 6 మొదటిదశ బ్లాకులు రెండు రెండవదశ బ్లాకులు, 7 సామాజికాభివృద్ధి బ్లాకులు ఒక ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకుఉన్నాయి. వీటి వైశాల్యం 4633.28 చదరపు మైళ్లు. జనాభా 11,78,572; ఈ కేంద్రాలలోని గ్రామాలసంఖ్య 819. భారత ప్రభుత్వంవారి నిర్ణయానుసారం 1959 సంవత్సరం ఏప్రిల్ నెల నుండి ఏర్పాటుచేయబడే ప్రతి బ్లాకులోకూడ ప్రత్యేకంగా వ్యవసాయరంగంలో ఒక సంవత్సరంపాటు తీవ్ర కృషి (ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమము) జరిగి ఉండాలి. అదేప్రకారం ఈ జిల్లాలోని ఉప్రవరం బ్లాకులో 1—4—58 నుండి ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమం మొదలుపెట్టబడింది. 1—4—58 నాటి నుండి ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమాన్ని ప్రారంభించిన బ్లాకు 1—4—59

నుండి మొదటిదశ బ్లాకుగా ప్రారంభించబడింది. ఇంతేకాక ఆలూరు, గిద్దలూరు ఎర్రగొండపాలెం కమ్నాలు సామాజకాభివృద్ధి బ్లాకులు 1–4–1959 తేదీనుండి రెండవదశ బ్లాకులుగా, మారాయి. 1959—60 లో యీ రాజ్యానికి 36 ప్రీ—ఎక్స్‌టెన్షన్ బ్లాకులు కేటాయించబడినాయి. ఇందులో 18 బ్లాకులు 1—4—59 నాడు, మిగతావి 2—10—1959 నాడు ప్రారంభించబడినాయి. ఇందులో ద్రోణాచలం బ్లాకు యీ జిల్లాలో ఉంది. ఇది 1—4—1959నాడు ప్రారంభించబడింది. ఈ విధంగా 1—4—1959 నాటికి యీ జిల్లాలో 7 మొదటిదశ బ్లాకులు, 5 రెండవ దశ బ్లాకులు, 5 సామాజికాభివృద్ధి బ్లాకులు, ఒక ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకు ఉన్నాయి.

ఈ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు పరచటంకోసం ఈ సంవత్సరం ప్రణాళికలో ఋణాల పద్దుక్రింద రు. 11,94,600లు, గ్రాంట్లు పద్దుక్రింద రు. 17 60 800లు, మొత్తం రు. 29,55,400లు, కేటాయించబడినాయి.

1—4—1959 నాటికి యీ జిల్లాలో ఉన్న బ్లాకులను చూపే పటం ప్రక్కపుటలో యివ్వబడింది.

# పంచాయితీలను పటిష్ఠం చేయడం

## సిబ్బంది పథకం

పంచాయతీలను పటిష్ఠం చేసే ఉద్దేశంతో, జిల్లాస్థాయిలో జిల్లా పంచాయితీ ఆఫీసరును రెవెన్యూ డివిజను స్థాయిలో డివిజనల్, పంచాయితీ ఆఫీసరును, తాలుకా స్థాయిలో బ్లాకు ప్రాంతాలను మినహాయించి డిప్యూటీ పంచాయతీ ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయతీలకు విస్తరణాధికార్లను నియమించడం మూలంగా, జిల్లాఆఫీసర్ల కార్యాలయంలలో అదనపు సిబ్బంది నియమించడం ద్వారా 1958—59 సంవత్సరంలో పంచాయతీ పరిపాలనకు సంబంధించిన పర్యవేక్షక, నిర్వాహక సిబ్బంది వ్యవస్థ పునర్వ్యవస్థీకరించ బడింది. 1959—60 ప్రణాళికలో రు. 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.120 లక్ష ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను కార్యాలయంలో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకు, రు. 0.191 లక్ష పడమర, తూర్పు ఇనస్పెక్టింగ్ ఆఫీసర్ల కార్యాలయాలలో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకు గాను ప్రత్యేకించబడినాయి. అదనంగా ఖర్చుపెట్టాల్సిన అవసరం ఉండే జిల్లాలకు తిరిగి పంపకంచేసే నిమిత్తం ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ ఆధీనంలో రు. 0.524 లక్ష ఉంచబడింది. మిగిలిన రు. 7.165 లక్షలలో రు. 0.3755లక్ష 1958—59 సంవత్సరంలో ఆయా జిల్లాలో నియమించబడిన అదనపుసిబ్బందిని కొనసాగించే నిమిత్తం ప్రత్యేకించబడింది.

## శిక్షణ పథకం

ఈ పథకం క్రింద సామర్లకోట రాజేంద్ర నగరులలో ఉన్న రెండు విస్తరణ శిక్షణ కేంద్రాలలో డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లకు, పంచాయతీలకు సంబంధించిన ఎక్స్టెన్షన్ ఆఫీసర్లకు, డివిజనల్ పంచాయతీ ఆఫీసర్లకు పరిపాలనా వ్యవహారాలకు సంబంధించి శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింపబడినది. ఈ శిక్షణ రెండు నెలలపాటు యివ్వబడుతుంది. తడవకు 40 మంది ఆఫీసర్లకు శిక్షణ యివ్వబడుతుంది. మొత్తంమీద అన్ని వర్గాలకు చెందిన 90 మంది ఆఫీసర్లకు 1959—60 లో శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింపబడింది.

ఇందుకుగాను ప్రణాళికలో రు. 2.90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాకు చెందిన ఆఫీసర్లకుకూడ యీ పథకంక్రింద శిక్షణ యివ్వబడుతుంది.

# బహుళార్థ సాధక ప్రాజెక్టు

## నాగార్జునసాగర్ ప్రాజెక్టు

నాగార్జునసాగర్ ప్రాజెక్టుకోసం రెండవ ప్రణాళికలో కేటాయించబడిన రు. 3,290 లక్షలలో రు 1099.61 లక్షల మొత్తం ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాల కాలంలో ఆనకట్ట, కుడి, ఎడమ కాలువలకు సంబంధించిన పనులకు గాను ఖర్చుపెట్ట బడింది. ఈ ప్రాజెక్టుపని కొన సాగించటం కోసం 1958–59 లో రు. 700 లక్షలు (యిది యిప్పుడు రు. 850 లక్షలకు పెంచ బడింది) కేటాయించ బడినాయి. ఈ మొత్తమంతా ఖర్చు చేయ బడగలదని ఆశింప బడుతున్నది. 1959–60 లో యీ పని కొనసాగింపుకోసం రు. 700 లక్షల మొత్తం కేటాయించ బడింది.

# పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు

పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనుల నిర్వహణకోసం 1959—60 సంవత్సరానికి రు. 120.23 లక్షల మొత్తం కేటాయించ బడింది. వీటి వివరాలు క్రిందయివ్వ బడినాయి:—

| వరుస సంఖ్య | ప్రాజెక్టు పేరు | 1958—59 లో కేటాయింపు. (రు లక్షలు) | కేటాయింపుకు కారణం | నీటిపారుదల జరిగే ప్రదేశం (ఎకరాలలో) |
|---|---|---|---|---|
| 1. | తుంగభద్ర ప్రాజెక్టులో-లెవల్ కెనాల్ | 18.23 | భూస్వాధీన ఖర్చులు | 1,00,000 |
| 2. | కడప-కర్నూలు కాలువ మైలు | | | |

| | | | | |
|---|---|---|---|---|
| | 74—6 సు-కి చివరిదాకా రీ-మాడల్ చేయటం, కాలువలనుకూడ రీమాడల్ చేయటం | 100.00 | — | — |
| 3. | జుర్రేరు రిజర్వాయరు | 2.00 | పని ప్రారంభించుటకు | — |

# విద్యుచ్ఛక్తి

## తుంగభద్ర జల విద్యుచ్ఛక్తి పథకము; తుంగభద్ర—నెల్లూరు హైడ్రో థర్మల్ పథకము.

9,000 కిలోవాట్ల శక్తిగల 2 జనరేటింగ్ యూనిట్లను ఆనకట్ట పవరు హౌసువద్ద, 3 యూనిట్లను నెలకొల్పటానికి ప్రతిపాదించ బడగా యిందులో 4 యూనిట్లు మాత్రం— 2 యూనిట్లు ఆనకట్ట పవరుహౌసునద్ద, 2 యూనిట్లు హాంపీ పవరు హౌసువద్ద 1957—58 సంవత్సరానికి నెలకొల్ప బడినాయి. విదేశి మారకద్రవ్యం లభ్యమైన వెంటనే తుంగభద్ర, నెల్లూరు హైడ్రో థర్మల్ పథకం క్రింద నెలకొల్పబడే 3 యూనిట్లతో పాటు హాంపీ పవరుహౌసువద్ద మూడవ యూనిట్టును కూడ నెలకొల్పడానికి ప్రతిపాదింప బడింది.

ఆనకట్టవద్ద, హాంపీవద్ద పవరుస్టేషనులను పూర్తిగా అభివృద్ధి పరచే నిమిత్తం 9.000 కిలోవాట్లశక్తి ఉండే మిగతి 3 యూనిట్లలో రెండింటిని ఆనకట్టపవరు హౌసు వద్ద, ఒక దానిని హంపీ పవరు హౌసు వద్ద నెలకొల్ప టానికి ప్రతిపాదింప బడింది. తుంగభద్ర విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రాలల్లో అప్పుడప్పుడు కలిగే విద్యుదుత్పత్తిలోపాన్ని భర్తీ చేసేటందుకుగాను నెల్లూరు వద్ద 30 మెగావాట్ల థర్మల్ స్టేషను నొకదాన్ని నెలకొల్పటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది,

పవరు స్టేషను పరికరాలకు కావలసిన విదేశి మారక ద్రవ్యం యింకా లభ్యం కానందువల్ల యీ ప్లాంటును నెలకొల్పటానికి ఉత్తరువులు యింతవరకు

యివ్వబడలేదు రాయలసీమలో మాచ్ ఖండ్ విద్యుచ్ఛక్తిని వినియోగించేందుకు వీలు కల్పించటంకోసం మాచ్ ఖండ్‌తో కలిపేనిమిత్తం 1959-60లో నెల్లూరు నుండి కడపకు 132 కె. వి. ట్రాన్స్‌మిషను లైనును వేయడానికి కడపలో 132 కె వి. సబ్ స్టేషనును ఏను చేసుకోవడానికి ప్రతిపాదింపబడింది. కేటాయించ బడిన రు. 58. 42 లక్షల మొత్తం లో (రు. 5. 42 లక్షల మొత్తం తుంగభద్ర జల విద్యుచ్ఛక్తి పథకానికి రు. 45.00 లక్షల మొత్తం తుంగభద్ర నెల్లూరు హైడ్రో థర్మల్ పథకానికి) రు. 18. 18 లక్షల మొత్తం యీ జిల్లా వాటా క్రింద ప్రత్యేకించ బడింది.

## గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

ఈ పథకం క్రింద గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయటమేగాక నాగార్జునసాగరు ప్రాజెక్టు పనులకు, సిర్పూరు ఫెర్రోమాంగనీసు ఫ్యాక్టరీ మొదలయిన పెద్ద పారిశ్రామిక కేంద్రాలకు విద్యుత్ సరఫరాలను విస్తరింపచేసేందుకు, రు. 10 లక్షలకు మించి ఖర్చయ్యే విస్తరణ పథకాలు అమలు పరచటం జరుగుతుంది. ఆంధ్ర ప్రాంతంలో 100 గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేసే నిమిత్తం 1959—60 సంవత్సరానికి రు. 100 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 4.0 లక్షల మొత్తం యీ జిల్లాకు కేటాయించబడింది. 4 గ్రామాలు విద్యుదీకరింపబడతాయి.

# గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు

## చిన్నతరహా పరిశ్రమలు

### వడ్రంగానికి సంబంధించిన ఆరు ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలను స్థాపించడం

వడ్రంగంలో స్థిరపడిన పనివారికి మేలురకం పరికరాలను వాడటంలోను, మేలురకంపద్ధతుల్లో నాణ్యమైన కుర్చీలు, బల్లలు మొదలగువాటిని తయారుచేయడంలోను శిక్షణ యిచ్చేటందుకుగాను 1956—57 లో శ్రీకాకుళం, ఏలూరు, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలులో వడ్రంగంపనికి సంబంధించిన 6 ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలు స్థాపించబడినాయి. వాటికి నిర్మించబడిన శాశ్వతభవనాలలో యీ కేంద్రాలుపనిచేస్తున్నాయి. ప్రతి కేంద్రంలోన్లు

ఏటా 12 మందికి శిక్షణ యివ్వడానికి ఏర్పాటు చేయబడింది. శిక్షణ కాలంలో ఒక్కొక్క అభ్యర్థికి నెలకు రు. 30/-ల చొప్పున స్టయిఫండు యివ్వబడుతుంది. మొదటి నుండీ సంవత్సరాల కాలంలోను పై 6 కేంద్రాలలో మూడు జట్లుగా 178 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వబడింది.

ఈ కేంద్రాలను కొనసాగించటానికి, 72 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వటానికిగాను యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0 95 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0 18 లక్ష యీ జిల్లాలో కేంద్రాన్ని కొనసాగించడానికి, 12 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వడానికిగాను కేటాయించబడింది.

## కమ్మరంపనికి సంబంధించిన ఆరు ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలను స్థాపించడం

కమ్మరంపనిలో స్థిరపడిన పనివానికి మేలురకం పద్ధతుల్లో వ్యవసాయ పరికరాలు, చేతిపనిముట్లు మొదలయిన వాటిని మరమ్మత్తు చేయడంలోను తయారుచేయడంలోను శిక్షణ యివ్వడంకోసం 1956—57 లో కమ్మరంపనికి సంబంధించిన ఆరు ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలు శ్రీకాకుళం, ఏలూరు, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలులో స్థాపించబడినాయి. వాటికై నిర్మించబడిన శాశ్వత భవనాలలో యీ కేంద్రాలు యిప్పుడు పనిచేస్తున్నాయి. ప్రతి కేంద్రంలోను ఏటా 12 మంది అభ్యర్థులు శిక్షణ పొందుతారు. వీరి కొక్కొక్కరికి నెలకు రు. 30/- లు స్టయిఫండుగా యివ్వబడతాయి. శిక్షణ పూర్తయింతర్వాత చిన్నతరహా తయారీకేంద్రాలను ఏర్పాటు చేసుకోవటానికి గాని లేక పారిశ్రామిక సహకార సంఘాలను ఏర్పాటు చేసుకోవడానికిగాని వీరికి తగిన ప్రోత్సాహం యివ్వబడుతుంది. మూడు జట్లుగా పై ఆరు కేంద్రాలలో యింతవరకు 175 మంది అభ్యర్థులు శిక్షణ పొందారు

ఈ కేంద్రాలు కొనసాగించడానికి, 72 మంది అభ్యర్థులతో కూడిన యింకో జట్టుకు శిక్షణ ఇవ్వటంకోసం యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.89 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.16 లక్ష యీ జిల్లాలోని కేంద్రాన్ని కొనసాగించటానికి 12 మంది అభ్యర్థులకు శిక్షణ యిచ్చేటందుకుగాను ప్రత్యేకించబడింది.

## ద్రోణాచలంలో పింగాణి వస్తువుల తయారీకి సంబంధించిన ఉత్పత్తి-శిక్షణ కేంద్రం

ఇది వ్యాపార సరళిలో నిర్వహించటానికి ఉద్దేశించబడిన పథకం కిం గాణి వస్తువులను తయారు చేయడమేగాక, పింగాణీ వస్తువులను మేలురకం పద్ధతుల్లో తయారు చేయుటం గురించి పని వారికి శిక్షణ యివ్వటానికి గూడ యీ పథకం క్రింద ఉద్దేశించబడింది. ఇందుకుగాను ద్రోణాచలంలో ఒక ఉత్పత్తి-శిక్షణ కేంద్రాన్ని స్థాపించడానికి ప్రతిపాదింపబడింది. ఇక్కడ ఏటా 6 మందికి శిక్షణ ఇవ్వటానికి వీలుంది. శిక్షణ కాలంలో ప్రతి అభ్యర్థికి నెలకు రు. 30/- లు స్టయిపండు యివ్వడం జరుగుతుంది. వర్కు షెడ్డు, కొలిమి నిర్మించడం, బావిని త్రవ్వడం పూర్తయింది. కావలసిన పరికరాలు, యంత్రాలు చాలవరకు 1958—59 లో ఖరీదు చేయబడినాయి. ఈ కేంద్రాన్ని కొనసాగించుటకు 6 మంది అభ్యర్థులకు శిక్షణ యిచ్చుటకుగాను యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.37 లక్ష కేటాయించబడింది. ఈ కేంద్రం పది మంది పనివారికి జీవనోపాధి కల్పిస్తుంది. ఈ సంవత్సరం యీ కేంద్రంవల్ల రు. 15,000 లు లభిస్తాయని ఆశించబడుతున్నది.

## ఉరవకొండలో "షీట్ మెటల్ వర్కు షాపు"ను స్థాపించటం

విద్యుచ్ఛక్తి సహాయంతో నడిచే యంత్రాలను ఉపయోగించడంద్వారా "షీట్ మెటల్" వస్తువులను తయారుచేసే ఉత్పత్తి-శిక్షణ కేంద్రాన్ని స్థాపించుటకు, 6 మంది అభ్యర్థులకు శిక్షణ యిచ్చుటకు ప్రతిపాదింపబడింది. అభ్యర్థులకు నెలకు రు. 30/- లు స్టయిఫండు యివ్వబడుతుంది.

భవనాల నిర్మాణానికి, యంత్రాల కొనుగోలుకుగాను యీ సంవత్సరం రు. 0.99 లక్ష కావలసి ఉంది. ప్రణాళిక కేటాయింపులను సర్దుబాటు చేయడంద్వారా యీ డబ్బు సమకూర్చబడుతుంది. ఈ పథకానికి భారత ప్రభుత్వంవారి ఆమోదం రావలసి ఉంది.

## నంద్యాల, సామర్లకోటలలో రెండు జనరల్ ఇంజనీరింగ్ సర్వీసింగ్ వర్కు షాపులను స్థాపించడం

నంద్యాల, సామర్లకోటలలో జనరల్ ఇంజనీరింగ్ సర్వీసింగ్ వర్కు షాపులను ఏర్పాటు చేయడానికి ప్రతిపాదింప బడింది. పై తావులలో ఉన్న

చిన్నతరహా పారిశ్రామికులకు, ముఖ్యంగా నంద్యాల, సామర్లకోటలలో ఉన్న పారిశ్రామిక ఎస్టేటులలో అద్దెకున్న పారిశ్రామికదారులకు సహాయపడే "సర్వీసు" కేంద్రాలుగా యివి ఉపయోగపడతాయి. "టూల్‌రూము" లుగా ఉపయోగపడతాయి. సామర్లకోట, నంద్యాలలో ఉన్న పారిశ్రామిక ఎస్టేటు"లో యీ కేంద్రాలు నెలకొల్పబడతాయి.

ఈ పథకం క్రొత్తగా రూపొందింపబడటంవల్ల దీనికోసం యీ సంవత్సరం ప్రణాళికలో కేటాయింపేమి చేయబడలేదు. అయినప్పటికీ యీ పథకం క్రింద యీ సంవత్సరం నిర్మించబడే భవనాలకు, కొనబడే యంత్రాలు, పరికరాలకు కావలసిన రు. 4.19 లక్షల మొత్తం యితర పథకాల విషయంలో కేటాయించబడిన డబ్బులో సర్దుబాట్లు చేయడంద్వారా సమకూర్చబడుతుంది.

## పరిశ్రమలకు రాజ్యప్రభుత్వ సహాయం చట్టంక్రింద ఋణాలు

ఈ పథకంక్రింద పరిశ్రమలకు రాజ్య ప్రభుత్వ సహాయం చట్టంక్రింద ఋణాలుగా రు. 13.11 లక్షల మొత్తం ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలకాలంలో యివ్వబడింది. ఈ సంవత్సరంలో మరొక రు. 7 లక్షల మొత్తం పారిశ్రామికులకు ఋణాలుగా ఇవ్వబడుతుంది ఈ జిల్లాలోని పారిశ్రామికులు *కూడ ఈ పథకంవల్ల ప్రయోజనం పొందుతారు.

## పరిశ్రమలశాఖ డైరెక్టరేటును, జిల్లాల సిబ్బందిని పటిష్ఠం చేయటం

రెండవ ప్రణాళికాకాలంలో ఎక్కువయిపోయిన పనిని నిర్వహించేటందుకుగాను రెండవ ప్రణాళికలో కేటాయించబడిన రు. 7.95 లక్షల వ్యయంతో రాజ్యస్థాయిలోను, జిల్లాస్థాయిలోను పరిశ్రమలశాఖను పటిష్టం చేయటానికి ప్రతిపాదింపబడింది. మొదటి 3 సంవత్సరాలకాలంలోను అద

---

*చిన్నతరహా పథకాలు చాలావాటికి యీ సంవత్సరం బడ్జెటులో యంత్రాల కొనుగోలుకుగాను డబ్బు కేటాయించబడింది. అయితే ఈ యంత్రాలను 1959 మార్చిలోనే నేషనల్ స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్ కార్పోరేషన్ ద్వారా కొనుగోలుచేయడంమూలంగా యీ సంవత్సరం బడ్జెటులో రు. 11.20 లక్షల మొత్తం మిగులు ఉన్నది.

నపు సిబ్బంది (సాంకేతిక) మరియు మినిస్టీరియల్ సిబ్బంది రు. 3.45 లక్షల వ్యయంతో నియమించబడుతుంది. ఇంతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించటానికి, ఇంకా కొంత అదనపు సిబ్బందిని నియమించటానికిగాను ఆంధ్ర ప్రణాళికలో రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది.

## బ్లాకు ప్రాంతాలలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాలు

బ్లాకు ప్రాంతంలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాల క్రింద రెండవ ప్రణాళికలో 10.17 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

## పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్లకు జీపులసరఫరా

ప్రతిపాదింపబడిన పథకాలు త్వరితంగాను సమర్థవంతంగా అమలు పరచబడాలంటే అందుకు సంబంధించిన పరిశ్రమల శాఖాధికార్లు తరచు పర్యవేక్షణ జరుపుతూ సాంకేతిక సహాయం అందజేస్తుండాలి. ఈ అధికార్లు త్వరత్వరగా పర్యటనలను జరిపేటందుకు వీలుగా వీరికి జీపులను సరఫరా చేయటం అవసరం. 1958—59 లో ఆంధ్రలోని పరిశ్రమల వాణిజ్యశాఖ డైరెక్టర్లకు జీపులు యివ్వబడినాయి. ఈ జీపుల నిర్వహణకోసం ఈ సంవత్సరానికి రు. 0.30 లక్ష కేటాయించబడింది. ఇందులో ఒక జీపు యీ జిల్లాలో ఉంది.

## పారిశ్రామిక ఎస్టేట్లు

### నంద్యాలలో పారిశ్రామిక ఎస్టేటు

1958—59 లో 9.01 ఎకరాలభూమి స్వాధీనం చేసికోబడి 10 ఫ్యాక్టరీ భవనాల నిర్మాణం నిమిత్తం ప్రాథమిక చర్యలు తీసికోబడినాయి. ఇందుకు 1958—59 లో రు. 0.57 లక్ష ఖర్చు పెట్టబడింది. అన్ని సౌకర్యాలు ఉండే విధంగా యీ 10 ఫ్యాక్టరీ భవనాలు నిర్మాణాన్ని పూర్తి చేసే నిమిత్తం రు. 2.50 లక్షల మొత్తం యీ సంవత్సరం ప్రణాళికలో కేటాయించ బడింది.

## పట్టు పరిశ్రమ

### ప్యాపలిలో ప్రయోగాత్మక "ఎరి" విత్తన క్షేత్రం ఏర్పాటు చేయడం

కర్నూలు జిల్లాలోని ప్యాపలిలో పట్టు పరిశ్రమాభి వృద్ధికి చాలా అవకాశముంది. ఇందువల్ల యీ పథకం క్రింద యిక్కడ ఒక ప్రయోగాత్మక "ఎరి" విత్తన క్షేత్రం స్థాపించ బడింది. ఈ క్షేత్రంలో 2 ఎకరాల ఆముద పుతోట,, ఒక "రేరింగుహౌసు" పంపుసెట్టుతో సహా ఒక బావి ఉన్నాయి. 1958—59 లో 345 పౌన్ల పట్టుకాయలు యీ క్షేత్రంలో ఉత్పత్తి చేయబడినాయి. 1959—60 లో యీ పథకం కొనసాగించ బడుతుంది. సుమారు 1,000 పౌన్ల "ఎరి" పట్టుకాయలు ఉత్పత్తి అవుతాయని ఆశింప బడుతున్నది. ఇందుకు ప్రణాళికలో రు, 1.05 లక్ష కేటాయించ బడింది.

## క్రొత్తపథకాలు

### పట్టు పరిశ్రమ ప్రాంతాల్లో ప్రచారం.

పట్టు పరిశ్రమలో ప్రజలకు శ్రద్ధాసక్తులు కలుగ చేయడానికి పట్టుపరిశ్రమ ప్రాంతాల్లో ప్రచారం చేయటం కోసం యీ పథకాన్ని అమలుపరచేటందుకు యీ సంవత్సరపు ప్రచారంలో రు. 0.01 లక్ష కేటాయించ బడింది.

## గ్రామీణ పరిశ్రమ

### బెల్లం, ఖాండసారీ పరిశ్రమ.

ఈ పథకం క్రింద, రైతులకు మేలు రకంపనిముట్లను కొనుక్కోవటానికి వడ్డీ లేకుండా ఋణాలు యివ్వబడతాయి. ఈ ఋణాలు 5 సంవత్సరాల కాలంలో వసూలు చేయబడతాయి. ఇంతేకాక మేలురకం బెల్లం, ఖండసారీలను తయారు చేయటం గురించి ప్రదర్శన పూర్వకంగా వివరింప బడుతుంది. అనకాపల్లి, చోడవరం రామచంద్రాపురం, చిత్తూరు, హిందూపురం తాలూకాలలో యీ పథకం మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో (1955) అమలు పరచ బడింది. ఇందుకుగాను ప్రత్యేక ఫీల్డు సిబ్బంది నియమించ బడింది. మేలురకం బెల్లం, ఖాండసారి తయారు చేయటంలో వీరు శిక్షణ పొందారు. 1956—57, 57—58 లలో యీ పథకం కొనసాగింప బడింది. అయితే

1958—59 లో యిది అమలు పరచ బడలేదు. ఈ సంవత్సరంలో యీ పథకాన్ని శ్రీకాకుళం జిల్లాలోని పాలకొండ తాలూకాకు, పశ్చిమగోదావరి జిల్లా తణుకుతాలూకాకు, కృష్ణా జిల్లా దివి తాలూకాకు, గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాకు, చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాకు విస్తరింప చేయడానికి, అంతేకాక ప్రస్తుతము యీ పథకం అమలులో ఉన్న ప్రాంతాలలో కొనసాగించటానికి ప్రతిపాదింప బడింది. ఈ పథకం క్రింద కార్యక్రమాలను క్రొత్త ప్రాంతాలకు విస్తరింప చేయుటం ద్వారా యిప్పుడున్న 30,000 ఎకరాలే కాక అదనంగా 32,650 ఎకరాలమేర యీ పథకం క్రిందకు తీసుకురా బడుతుంది. ప్రస్తుతం యీ పథకం పరిశ్రమల శాఖవారి నియంత్రణలో అమలుపరచ బడుతున్నది. ఇప్పుడు దీన్ని ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు క్రిందకు మార్చడానికి ప్రతిపాదింప బడింది. ఈ బోర్డు 1958 నవంబరు లో ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరంలో యీ పథకం కోసం రు. 6·00 లక్షలు కేటాయింప బడినాయి.

### 1948 సంవత్సరపు కుటీర పరిశ్రమలకు ఋణాలు

### సబ్సిడీల నివ్వటానికి సంబంధించిన నిబంధనల క్రింద ఋణాలు.

వడ్రంగం, నేతపని, కమ్మరం మొదలయిన వివిధ కుటీర, గ్రామీణ పరిశ్రమలలో పనిచేస్తున్న పని వారికి సహాయం చేసే ఉద్దేశంతో రెండవ ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాల కాలంలో రు. 1.64 లక్షల మొత్తం ఋణాలుగా పంపకం చేయబడింది. 1958—59 లో యీ పథకం అమలు పరచ బడలేదు. ఈ సంవత్సరంలో రు. 2 00 లక్షల వరకు ఋణాలు మంజూరు చేయడానికి ప్రతిపాదింప బడింది. ఈ జిల్లాలోని పనివారికి యీ పథకం వల్ల లాభం చేకూరుతుంది

### పారిశ్రామిక సహకార సంఘాలు.

గ్రామీణ పరిశ్రమలకు సుస్థిరత్వాన్నే కూర్చడం వాటి ఉత్పత్తి విధానాల్ని మెరగు పరచడం ద్వారా అధికోత్పత్తిని సాధించేటట్లు చేయడమే యీ పథకం యొక్క ఉద్దేశం. ఇందుకుగాను సహకార సంఘాల ద్వారా దంపుడు బియ్యం పరిశ్రమను అభివృద్ధి పరచేటందుకు 10 కేంద్రాలను ప్రారంభించటం,

కలంకారి అద్దకం పరిశ్రమకు నిర్వహణ మూలధనం, యితర ఖర్చుల క్రింద గ్రాంటులు యివ్వటం, మేలురకం పరికరాలు కొనుక్కోవటానికి గుంటూరు కమ్మరం సహకార సంఘం వారికి ఆర్థిక సహాయం చేయటం, పరికరాలు మొదలయినవి కొనుక్కోవటానికిగాను కుటీర పరిశ్రమల సహకార సంఘము లకు సబ్సిడీలు యివ్వటంవంటి పథకాలు రూపొందించ బడినాయి. ఇందుకు గాను యీ పథకం క్రింద ఇంతవరకు రు. 2.72 లక్షల మొత్తం ఖర్చుపెట్ట బడింది. ఈ పథకం కొనసాగింపుకోసం ఈ సంవత్సరానికి రు. 1.58 లక్షల మొత్తం కేటాయించబడింది. క్రొత్తగా ఏర్పాటు చేయబడిన ఆంధ్ర ప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమలబోర్డు అధ్వర్యంక్రిందకు యీ పథకాన్ని మార్చటానికి కూడ ప్రతిపాదింపబడింది.

# చేనేతపరిశ్రమ

## సహకారసంఘాలకువాటామూలధనము

## నిర్వహణమూలధనంక్రింద ఋణాలు

చేనేత సహకార సంఘాలలో వాటాలు తీసికొని అందులో సభ్యులుగా అయ్యేటందుకు వీలు కల్పించే నిమిత్తం చేనేత పనివారికి ఋణాలను యివ్వ టానికి యీ పథకంక్రింద ఉద్దేశింపబడింది. ఈ సంవత్సరపు ఆంధ్ర ప్రణా ళికలో యీ పథకమునకుగాను రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష వాటా మూలధనం ఋణాలు యివ్వటంకోసం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 200 క్రొత్త మగ్గాలు సహకార సంఘాల క్రిందకు తీసుకు రాబడతాయని, 20 లక్షల గజా గుడ్డ ఉత్పత్తి చేయబడుతుందని ఆశింపబడింది.

## ఆంధ్ర చేనేత సహకార సంఘాలయొక్క మార్కెటింగు వ్యవస్థ వివరణ

ఇంకా ఎక్కువగా విక్రయశాలలను ప్రారంభించటంద్వారాను, చేనేత గుడ్డలను గురించి తీవ్ర ప్రచారము చేయటంద్వారాను ఆంధ్ర చేనేత సహకార సంఘంవారి మార్కెటింగు వ్యవస్థను పటిష్ఠం చేయటానికి యీ పథకం క్రింద ఉద్దేశించబడింది. ఈ పథకమునకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.31

లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.30 లక్ష యీ జిల్లాకు అదనంగా 3 విక్రయశాలలు ప్రారంభించటానికిగాను వినియోగించబడుతుంది. ఈ సంవత్సరంలో విక్రయశాలలద్వారా 8 లక్షల గజాలగుడ్డ అమ్ముడుపోగలదని ఆశించబడుతున్నది.

## ఉత్పత్తి విధానాల అభివృద్ధి, వ్యవస్థవ్యయాలు

మంచిరకం చేనేత గుడ్డలను ప్రజారంజకంగా ఉండే నమూనాలలో ఉత్పత్తి చేయుటకుగాను చేనేత పరిశ్రమయొక్క సాంకేతిక నైపుణ్యాన్ని అభివృద్ధి పరచటానికి యీ పథకం క్రింద ప్రతిపాదించబడింది. ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో యీ పథకం అమలు పరచబడింది. స్టాండర్డు రీడ్లు, వార్పింగు యంత్రాలు మొదలైన మేలురకం పరికరాలు చేనేత పనివారికి సరఫరా చేయబడినాయి. ఈ సంవత్సరంలో ఆంధ్రకుగాను ప్రణాళికలో రు. 4.80 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.3[illegible] లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది. చేనేత పనివారికి 45 స్టాండర్డు రీడ్లను, నాలుగు వార్పింగు యంత్రాలను, 40 స్లేలను, ఒక ప్రెస్ మెషిన్‌ను సరఫరా చేయటానికి, గుడ్డల నాణ్యతను సరిచూడటానికి నియమించబడిన ఇద్దరు టెక్నికల్ అసిస్టెంట్లను కొనసాగించటానికి యీ డబ్బు వినియోగించబడుతుంది.

## అద్దకం ఫ్యాక్టరీల స్థాపన

ఆంధ్రప్రాంతానికి యీపథకం కోసం యీ సంవత్సరానికి కేటాయించబడిన రు. 0.14 లక్ష మొత్తంలో రు. 0.05 లక్ష యీ జిల్లాలో ప్రస్తుతమున్న అద్దకం ఫ్యాక్టరీని ఆధునిక పద్ధతుల్లో తీర్చి దిద్దటానికిగాను ప్రత్యేకించబడింది. ఈ సంవత్సరం యీ ఫ్యాక్టరీద్వారా దాదాపు 1 500 లక్షల పౌనుల సూలుకు అద్దకం వేయబడుతుందని ఆశించబడుతున్నది.

## ముదరా

చేనేతగుడ్డ అమ్మకాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా చేనేతగుడ్డ ఉత్పత్తిని ఎక్కువ చేసేటందుకుగాను ఆంధ్ర చేనేత సహకార సంఘం యొక్క

విక్రయశాలలద్వారా ప్రాథమిక చేనేత సహకార సంఘాలద్వారా జరిగేచేనేత గుడ్డ అమ్మకంపై ముదరా యివ్వబడుతున్నది. సామాన్యంగా యీ ముదరా రూపాయకు 6 నయాపైసలు చొప్పున యివ్వబడుతుంది సరుకు మిగిలిపోయి ఉన్న సందర్భాల్లో సంఘాలు తమదగ్గర నిలువఉండిపోయిన సరుకును అమ్మేటందుకుగాను అప్పుడప్పుడు ప్రత్యేక ముదరాకూడ యివ్వబడుతుంది. ఈ పథకంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 35.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.75 లక్ష యీ జిల్లాలో ముదరా యిచ్చుటకుగాను వినియోగించబడుతుంది.

## కంబళ్లపరిశ్రమ

ఆంధ్రప్రాంతంలో కంబళ్ల పరిశ్రమ అభివృద్ధికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.67 లక్ష మొత్తం కర్నూలు జిల్లాకు క్రిందిపనుల నిమిత్తం ప్రత్యేకించబడింది

1. 150 మగ్గాలతో కంబళ్ళనేత పనివారి సహకార సంఘం ఒకదాన్ని ఏర్పాటు చేయటం.
2. కేంద్రం అమ్మకం డిపో నొకదాన్ని ఏర్పాటు చేయటం.
3. గుడ్డల నాణ్యతను పరిచూడటంకోసం ఒక టెక్నికల్ అసిస్టెంటును నియమించటం.
4. కంబళ్ళనేత పనివారి సహకార సంఘాలకు రెండు ఊలు కార్డింగ్ యంత్రాలను సరఫరా చేయటం

ఈ జిల్లాలోని చేనేత సహకార సంఘాలద్వారా 6,000 రగ్గులు, కంబళ్లు తయారు చేయబడతాయని ఆశించబడుతున్నది.

# రోడ్లు

## ప్రభుత్వ రోడ్లు (బకాయి పనులు)

ఆంధ్ర ప్రాంతంలో బకాయి రోడ్డు పనుల నిర్వహణను కొనసాగించటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 2.93 లక్షల మొత్తం కేటాయించ

బడింది. ఇందులో రు. 0·247 లక్ష ఈ జిల్లాకు క్రింది పనుల నిమిత్తం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పని వివరం | 1959—60లో కేటాయించ బడిన మొత్తం (రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 1 | కోయిలకుంట్ల---ఎఱ్ఱగుడి రోడ్డుకు కంకర వేయటం .... | 0.001 |
| 2. | డోర్నాల పాస్ రోడ్డులో మై. 83/4 వద్దవంతెన నిర్మించటం ... | 0.001 |
| 3. | ఆదోని-సిరిగుప్ప రోడ్డు మై 11/7 వద్ద వంతెన నిర్మించటం .... | 0.236 |
| 4. | కోయిలకుంట్ల-నొస్సాంరోడ్డు మై. 7/1 వద్ద వంతెన నిర్మించటం .... | 0.009 |

## ప్రభుత్వరోడ్లు (క్రొత్తపనులు)

ఆంధ్ర ప్రాంతానికి ఈ పథకం క్రింద 1959—60 సంవత్సరానికి రు.41·69 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులోరు. 4·307 లక్షల మొత్తం క్రింది పనుల నిమిత్తం ఈ జిల్లాకు ప్రత్యేకంచబడింద.

| వరుస సంఖ్య | పని వివరం | 1959—60లో కేటాయించ బడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | చిత్తూరు-కర్నూలురోడ్డులో మై 213/6 వద్ద వంతెన నిర్మాణం .... | 0.009 |
| 2. | కర్నూలు-చిత్తూరురోడ్డులో మై. 219/8 వద్ద "లోలెవల్" వంతెననిర్మాణం .... | 0.006 |

| | | |
|---|---|---|
| 3. | బళ్ళారి కర్నూలురోడ్డు ...-47/8 మైళ్ళ మధ్య అత్యావశ్యకమైనచోట్ల "డిప్పు" లను అభివృద్ధి పరచటం; దృఢంగా లేనట్టి, ఇరుకుగా ఉన్నట్టి వంతెనలను, కల్వర్టులను పటిష్ఠంచేయుటం.... | 0.008 |
| 4. | బళ్ళారి-కర్నూలు రోడ్డులో 20 మైళ్ళ పర్యంతం తారువేయటం ... | 0.615 |
| 5. | బళ్ళారి-కర్నూలురోడ్డులో మై 35/6 వద్ద వంతెన నిర్మాణం .... | 0 050 |
| 6. | తుంగభద్ర ఆయకట్టు ప్రాంతంలో కోడుమూరు-గొనెగుండ్లరోడ్డుకు మై. ÷ నుండి 12/0 వరకు కంకర వేయటం. | 0.200 |
| 7. | ఆళ్ళగడ్డ-అహోబిలం రోడ్డుకు 0/1-14/7 మైళ్ళమధ్య కంకర వేయుటం .... | 2.900 |
| 8. | చిత్తూరు-కర్నూలు రోడ్డుమీద ఉన్న "డిప్పు"లను అభివృద్ధిచేయుటం; దృఢంగా లేనట్టి, ఇరుకుగా ఉన్నట్టి వంతెనలను కల్వర్టులను పటిష్టం చేయుడం .... | 0.200 |
| 9. | గుంతకల్లు-తుంగభద్ర రోడ్డులో 363/0—378/0 మైళ్ళమధ్య "డిప్పు"లనుఅభివృద్ధి చేయుటం; దృఢంగాలేనట్టి, యిరుకుగా వున్నట్టి వంతెనలను కల్వర్టులను నిర్మించటం .... | 0.100 |
| 10. | చిత్తూరు కర్నూలురోడ్డులో మై 195/0 నుండి 202/3 వరకు ఉన్న ఘాటు ప్రాంతానికి అభివృద్ధిపనులుచేయుడం. | 0.13 |

## ప్రభుత్వం స్వాధీనంచేసికొన్న రోడ్లస్థాయిని పెంచటం

ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వంవారిచే ఇంతకుముందు స్వాధీనం చేసికొనబడిన జిల్లా బోర్డు రోడ్లస్థాయిని పెంచటంకోసం 1959—60 ప్రణాళిక లో రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.32 లక్షల మొత్తం యీ జిల్లాలో క్రింది రోడ్లస్థాయిని పెంచటంకోసం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు, లక్షలలో) |
| --- | --- | --- |
| 1. | కోయిలకుంట్ల-అవుకు రోడ్డులో 7/5–8/1 మైళ్ళమధ్య అండర్ మెటెల్ రోడ్డు డాములను నిర్మించటం .... | 0.20 |
| 2. | ప్యాపలి-బనగానపల్లి-గాజులపల్లి రోడ్డులో 44/2–61/0 మైళ్ళమధ్య కల్వర్టులను పటిష్ఠంచేయటం .... | 0.20 |
| 3. | ఎమ్మిగనూరు-గరిగండ్ల రోడ్డుమీద వంతెనలను, కల్వర్టులను నిర్మించటం .... | 0.50 |
| 4. | కంబం—మార్కాపురం రోడ్డుమీద మై. 14/0 నుండి 19/6 వరకు, 142 మైలు వద్ద సిమెంటు కాంక్రీటు చేయటం. | 0.30 |
| 5. | ఎమ్మిగనూరు—గోనెగుండ్ల రోడ్డును ప్రామాణిక వెడల్పుకుసరిగా అభివృద్ధి చేయుటం .... | 0.12 |

ఇంతేకాక క్రిందిజిల్లాబోర్డురోడ్లను యీ పథకంక్రింద స్వాధీనంచేసికొనటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు కేటాయింపేమీ అవసరంలేదు.

| వరుస సంఖ్య | రోడ్డు పేరు | పొడవు, మైళ్ళలో మై—ఫ—అ |
|---|---|---|
| 1- | తాటిచెర్ల-అల్లింగారంరోడ్డు ఎం. డి. ఆర్. 0—0—0 నుండి 15—0—216 వరకు | 15—0—216 |

## రోడ్ల ప్రక్కనచెట్లు.

రోడ్ల కిరువైపులా చెట్లను నాటటం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో యీ జిల్లాకు రు. 0.06 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## ఇతర రోడ్లు (బకాయి పనులు)

ఈ పథకం క్రింద 1959-60 ప్రణాళికలో రు.15.00 లక్షల మొత్తం కేటాయించ బడుతుంది. మొదటి ప్రణాళికా కాలంలో ప్రారంభించ బడి ముగింప బడకుండా ఉన్నటువంటి పి. డబ్ల్యు. ఆర్. డి. రోడ్డు పనులను పూర్తి చేసే నిమిత్తం ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు పూర్తి గ్రాంటు యివ్వటం కోసం పై డబ్బు వినియోగించ బడుతుంది, ఇందులో రు. 2.20 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ఇతర రోడ్లు (క్రొత్తపనులు.)

పి. డబ్ల్యు. ఆర్. డి. రోడ్డు పనులను చేకొనే నిమిత్తం యీ పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు సగం గ్రాంట్లు యివ్వబడతాయి. జిల్లా బోర్డులు, యీ రోడ్లవల్ల ప్రయోజనం పొందేవారు మిగతసగం ఖర్చును భరించాలి. క్రొత్త పనుల నిర్వహణ నిమిత్తం ఆంధ్రలోని జిల్లా బోర్డులకు గ్రాంట్లు యివ్వటం కోసం 1959-60 లో రు. 6.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.30 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## గ్రామ ప్రణాళికలలో రోడ్లు.

ఈ పథకం క్రింద కల్వర్టులు, వంతెనలు, గ్రామాలకు క్రొత్త రోడ్లు, గ్రామాలకు గ్రామాలకు మధ్య రోడ్లు నిర్మించటం జరుగుతుంది. జిల్లా కలెక్టర్ల

యీ పథకం క్రింద చేయవలసిన పనులను నిర్ణయించి నిర్వహిస్తారు. ఖర్చులో సగం ప్రభుత్వంవారు భరిస్తారు. మిగత సగం ఖర్చుయీ రోడ్లవల్ల ప్రయోజనం పొందే ప్రజలు భరించాలి. ఆంధ్రలో యీ పథకం క్రింద 1959—60 లో రు 15.00లక్షల మొత్తం ఖర్చు పెట్టటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు 1.539 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## పర్యటనత్వాభివృద్ధి

ఆంధ్రలో పర్యటనత్వాభివృద్ధికిగాను 1959 - 60 ప్రణాళికలో రు .1 09 లక్షల మొత్తం కేటాయించబడింది. వసతి సౌకర్యాలు, వినోద సౌకర్యాలు ముఖ్యంగా యీ పథకం క్రింద సమకూర్చ బడతాయి. పై మొత్తంలో రు. 0.12 లక్ష యీ జిల్లాకు క్రిందిపనికిగాను కేటాయించబడింది.

| వరుస సంఖ్య | పని వివరం | 1959—60లో కేటాయించ బడిన మొత్తం (రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 1. | ఇతర పథకములు, (ట్రావెలర్స్ బంగళాలు ఇనస్పెక్షన్ బంగళాలు నిర్మించటం) | 0.12 |

# విద్య

## ప్రాథమిక విద్య

ఈ జిల్లాలో ప్రాథమిక విద్యాభివృద్ధికోసం రు 7.359 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | కొనసాగింపు పథకాలు | |
| 1, | 1956—57 సం. లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు | |
| | (ఎ) ఎయిడెడ్ పాఠశాలలు (5 పాఠశాలలు) | 0.050 |

| | |
|---|---|
| 2. 1957—58 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన ఉపాధ్యాయులు, (ఏ) స్థానిక సంస్థలు (4 పాఠశాలలు) | 0 020 |
| 3. 1958—59 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు | |
| (ఏ) స్థానిక సంస్థలు (4 పాఠశాలలు) | 0.030 |
| (బి) ఎయిడెడ్ (16 పాఠశాలలు) | 0.030 |
| 4. 1957—58 లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు. | |
| (ఎ) ఎయిడెడ్ (16 పాఠశాలలు) .... | 0.240 |
| 5. 1958—59 లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు .... | |
| (ఎ) స్థానిక సంస్థలు (50 పాఠశాలలు) . | 0.020 |
| (బి) ఎయిడెడ్ (30 పాఠశాలలు).... | 0.020 |
| 6. 1957—58లో జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు | |
| (ఎ) ప్రభుత్వంవారివి (సాంఘిక సంక్షేమ శాఖ) (రెండు పాఠశాలలు)<br>(బి) స్థానిక సంస్థలవి (37 పాఠశాలలు)<br>(సి) ఎయిడెడ్ (8 పాఠశాలలు) | 0.006 |

7. 1958—59 లో జూనియరు బేసిక్ పాఠశాల లుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు

(ఎ) ఎయిడెడ్ (6 పాఠశాలలు) ... 0.003

8. ప్రాథమిక మాధ్యమిక పాఠశాలలలో పనిచేసే ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపుకు ... 2 840

9. ప్రాథమిక పాఠశాలలలో శాస్త్ర విజ్ఞాన బోధనకు (కర్నూలులోని ప్రభుత్వ శిక్షణ కళాశాలకు అనుబంధించబడిన ప్రభుత్వ యూనిట్టుయొక్క పైలట్ పథకం ... 0.050

10. 1956—57 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు తరగతులకు

(ఎ) ప్రభుత్వంవారివి (ఒక పాఠశాల, మూడు సెక్షనులు) ... 0.170

(బి) స్థానిక సంస్థలవి (10 సెక్షనులు) ... 0.080

(సి) ఎయిడెడ్‌వి. (7 సెక్షనులు) .... 0.030

11. 1957—58 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు తరగతులకు

(ఎ) ప్రభుత్వంవారివి (ఒక పాఠశాల 19 సెక్షనులు) .... 0.230

(బి) ఎయిడెడ్ (రెండు సెక్షనులు) .... 0.060

12. 1958—59 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షనులకు (ప్రభుత్వం వారివి) (ఒక పాఠశాల, 2 సెక్షనులు) .... 0.150

| | | |
|---|---|---|
| 13. | 1957—58, 1958—59 సంవత్సరాలలో ప్రారంభించబడిన ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలకు భవనాలు అట్టిస్థలాలు (ఒక పాఠశాల) | 0.070 |
| 14. | 1956—57 లో సెకండరీ గ్రేడు శిక్షణ విభాగాలుగా మార్చబడిన హైయర్ ఎలిమెంటరీ గ్రేడు శిక్షణ విభాగాలకు. ... | 0.010 |
| 15 | 1958—59 లో బేసిక్ పద్ధతికి మార్చబడిన ప్రా. శిక్షణ పాఠశాలలకు | 0.020 |
| 16. | 1957—58 సం. లో ఇన్‌స్పెక్టరేటులలో నియమించ బడిన గుమాస్తాలకు, టైపిస్టులకు (ఇద్దరికి) .... | 0.010 |
| 17. | 1958—59 లో నియమించ బడిన సీనియరు డిప్యూటీ ఇనస్పెక్టరులను జవానులను కలుపుకుని (4 పదవులు.) ... | 0.060 |
| 18.. | సబార్డినేట్ ఆఫీసర్ల కార్యాలయాలకు అద్దె క్రింద .... | 0.030. |
| 19. | మూడవ ఫారం వరకు ఉచిత విద్యను గరపటానికి సంబంధించిన పథకాన్ని అమలు పరచుటకు ఇనస్పెక్టరేటులతో నియమించ బడిన అప్పరుడివిజను గుమాస్తాలకు(ఒక గుమాస్తా) ... | 0.010 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 20. | విద్యా వంతులైన నిరుద్యోగులకు ఉద్యోగం కల్పించటానికి సంబంధించిన పథకం.... | 1.090 |
| 21. | ప్రాథమిక పాఠశాలలలో అదనంగా ఉపాధ్యాయులను నియమించుటకు (27మంది ఉపాధ్యాయులు.) .... | 0.180 |

| | | |
|---|---|---|
| 22. | ప్రాథమిక పాఠశాలలను జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చుటకు. | |
| | (ఏ) స్థానిక సంస్థలవి (21పాఠశాలలు.) | 0 060 |
| | (బి) ఎయిడెడ్ వి (7పాఠశాలలు.) | 0.030 |
| 23. | స్త్రీ విద్యకు సంబంధించిన కేంద్ర పథకం—ప్రత్యేక శిక్షణ పాఠశాల. (ఒకటి) ... | 0.180 |
| 24. | జిల్లాబోర్డులు ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలలను స్వాధీన పరచుకొనటం .... | 0 820 |
| 25. | 1958—59 లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయర్ ఎలిమెంటరీ పాఠశాలలకు గ్రాంట్లు | |
| | (ఎ) ఎయిడెడ్ వి (4పాఠశాలలు .... | 0.010 |
| | (బి) స్థానిక సంస్థలవి (14 పాఠశాలలు) .... | 0.370 |
| 26. | మాధ్యమిక పాఠశాలలలో అదనపు తరగతులను ప్రారంభించటం (ఎయిడ్ పాఠశాలలు) కాంపెన్సేటరీ గ్రాంటు. .... | 0.050 |
| 27. | బాలికలకు ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలను స్థాపించటం (గిద్దలూరులో ఒక పాఠశాల) | 0 130 |
| 28. | ప్రాచ్యవిద్యా మాధ్యమిక పాఠశాలలకు, 1958—59 లో ప్రారంభించబడిన అదనపు సెక్షనులకు గ్రాంట్లు. | |
| | (ఎ)ఎయిడెడ్ (ఒక సెక్షను) ... | 0.010 |

29. ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభించటం (ఒక సెక్షను).... 0.020

30. ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలలో అంబర్ చర్ఖా పథకం (2 పాఠశాలలు.) .... 0.010

31. జిల్లా విద్యాశాఖాధికార్లకు జీపుల సరఫరా (8 జీపులు.) .. 0.160

32. కర్నూలులో బాలబాలికల కోసం ఏర్పాటు చేయబడిఉన్న ప్రభుత్వ హైయర్ సెకండరీ పాఠశాలలలో సెకండరీ గ్రేడు ఉర్దూ శిక్షణ విభాగాన్ని ప్రారంభించటం .. 0.060

మొత్తం 7.359

## సెకండరీ విద్య

సెకండరీ విద్యాభివృద్ధికోసం యీ జిల్లాకు రు. 3 774 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

| వరుస సంఖ్య. | పథకం పేరు. | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | 1956—57 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అధనపు సెక్షనులు | |
| | (ఎ) ప్రభుత్వంవారివి (ఒక సెక్షను) | 0.010 |
| | (బి) స్థానిక సంస్థలవి (15 సెక్షనులు) | 0.100 |
| | (సి) ఎయిడెడ్ వి (7 సెక్షనులు) | 0.020 |

| | | | |
|---|---|---|---|
| 2 | 1957—58 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షనులు | | |
| | (ఎ) స్థానిక సంస్థలవి | (7 సెక్షనులు) | 0.110 |
| | (బి) ఎయిడెడ్ వి | (రెండు సెక్షనులు) | 0.020 |
| 3. | 1957—58లో హైయర్ సెకండరి పాఠశాలల స్థాయికి మార్చబడిన ఉన్నత పాఠశాలలు. | | |
| | (ఎ) ప్రభుత్వంవారివి | (ఒక పాఠశాల) | 0.020 |
| | (బి) ఎయిడెడ్ వి | (ఒక పాఠశాల) | 0.020 |
| 4. | ఉన్నత పాఠశాలలకు భవనాలకోసం గ్రాంట్లు | | |
| | (ఎ) స్థానిక సంస్థలకు | .... | 0.050 |
| | (బి) ఎయిడెడ్ వాటికి | .... | 0.020 |
| 5. | హైయర్ సెకండరి పాఠశాలలకు భవనాలు | | |
| | (ఎ) ప్రభుత్వంవారివి | (ఒక పాఠశాల) | 0.300 |
| | (బి) ఎయిడెడ్ వి | (ఒక పాఠశాల) | 0.030 |
| 6. | సెకండరి పాఠశాలల ఉపాధ్యాయుల జీతాలు పెంచటానికి | .... | 0.680 |
| 7. | 1958—59 లో పునర్వ్యవస్థీకరించబడిన శిక్షణ కళాశాల సిబ్బందికి | .... | 0 040 |
| 8. | కర్నూలులోని ప్రభుత్వ శిక్షణ కళాశాలలో నియమించబడిన అదనపు సిబ్బందికి | .... | 0.020 |

## క్రొత్త పథకాలు

9. 1958—59 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలవి .... 0.100

(బి) ఎయిడెడ్‌వి .... 0.050

10. మాధ్యమిక పాఠశాలలను (ప్రభుత్వం వారివి) ఉన్నత పాఠశాలల స్థాయికి పెంచటం, సెకండరీ పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభించటం (నంద్యాలలో ఉన్న ప్రభుత్వ మాధ్యమిక బాలికల పాఠశాల కర్నూలు "బి" క్యాంపులో ఉన్న ప్రభుత్వ బాలికల మాధ్యమిక పాఠశాల) .... 0 060

11. ఉన్నత పాఠశాలలను హైయర్ సెకండరీ పాఠశాలగా మార్చడం

(ఎ) ఎయిడెడ్ (ఒక పాఠశాల) ... 0.510

12 కర్నూలు లోని ప్రభుత్వ బాలికల ఉన్నత పాఠశాలలో కుట్టుపనిని దుస్తుల తయారీని "బైఫర్ కేటెడ్ సబ్జక్టు"గా ప్రవేశపెట్టడం..... 0.010

13. ఉన్నత పాఠశాలలకు భవనాల క్రింద గ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలవి. ... 0.100

(బి) ఎయిడెడ్‌వి .... 0.200

14. ఉన్నత పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్యసామానులకు, పరికరాలకు గాను గ్రాంట్లు

| | | | |
|---|---|---|---|
| | (ఎ) స్థానిక సంస్థలకు | ... | 0.100 |
| | (బి) ఎయిడెడ్ వాటికి | .... | 0.100 |
| 15. | ప్రభుత్వ శిక్షణ కళాశాలలను పటిష్ఠం చేయుటం. | ... | 0.040 |
| 16. | ప్రభుత్వ శిక్షణ కళాశాలలో అదనంగా ట్యూటర్లను, అసిస్టెంటులెక్చరర్లను నియమించటం... | | 0.020 |
| 17. | XI, XII తరగతుల్లో చదువుకొనే విద్యార్థులకు స్కాలరు షిప్పులు. | .... | 0.004 |
| 18. | పౌర విద్యా శిక్షణ కేంద్రాలు | .... | 0.010 |
| 19. | ప్రభుత్వ బాలుర బహుళార్థక హైయర్ సెకండరీ పాఠశాలలలో ఫిజికల్ డైరెక్టర్ల (వ్యాయామశిక్షకులు)నియామకం (4 పదవులు) | | 0.010 |
| 20. | కర్నూలులోని ప్రభుత్వ శిక్షణ కళాశాలకు భవనాలు | .... | 1.000 |
| 21. | కర్నూలులోని ప్రభుత్వ శిక్షణ కళాశాలలో "ఎక్స్టెన్షన్ సర్వీసు"ప్రవేశ పెట్టట. | | 0.060 |
| | | మొత్తం | 8.774 |

## యూనివర్సిటి విద్య

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్సిటీ విద్యాభివృద్ధికిగాను ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 34.64 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరమునకుగాను ఆంధ్ర ప్రాంతానికి ప్రణాళికలో రు. 24.56 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.80 లక్ష క్రింద పథకాలకుగాను ... జిల్లాకు కేటాయించ బడింది.

| | | |
|---|---|---|
| 1. | కర్నూలు కె. ఆర్. ఆర్. ప్రభుత్వ స్త్రీల కళాశాలకు .... | 0.51 |
| 2. | ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలల్లోను శిక్షణ కళాశాలల్లోను అదనపు సిబ్బంది నియామకం .... | 0.01 |
| 3. | ఒకవయిడెడ్ కళాశాలలో మూడేండ్ల డిగ్రీ కోర్సుప్రవేశ పెట్టటం. ... | 0.28 |
| | మొత్తం | 0.80 |

## ఇతర పథకాలు

క్రింద చూపిన విధంగా ఇతర పథకాలకోసం యీ జిల్లాలో రు.0·725 లక్ష మొత్తం ఖర్చు పెట్టబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | కొనసాగించ బడుతున్న పథకాలు. | |
| 1. | ఎన్. సి. సి. ఎ. సి. సి ల విస్తృతికి ... | 0.460 |
| 2. | జిల్లా సాంఘిక విద్యాధికార్ల కార్యాలయాలు | 0.150 |
| 3. | స్కౌటింగు, గర్ల్ గైడింగు అభివృద్ధికి .... | 0.020 |
| | క్రొత్త పథకాలు | |
| 4. | పంచాయితీలు, ప్రయివేటువారికి, సహకార సంఘాలకు, గ్రామ సంఘాలకు, స్థానిక సంస్థలకు చెందిన గ్రంథాలయాలకు గ్రాంట్లు.... | 0.060 |
| 5. | హిందీ పాఠశాలలకు గ్రాంట్లు (ఒక పాఠశాల) | 0.020 |
| 6. | హిందీ ప్రేమీమండలుల గ్రంథాలయాలకు గ్రాంట్లు | 0.005 |

| | | | |
|---|---|---|---|
| 7. | యువక సంక్షేమ కార్యక్రమాలకు | .... | 0.010 |
| | | మొత్తం | 0.725 |

# వైద్యం

## ప్రభుత్వ జనరల్ ఆసుపత్రి, కర్నూలు

కర్నూలులోని ప్రభుత్వ జనరల్ ఆసుపత్రిలోని పడకల సంఖ్య 1956-57 లో 300 నుండి 350కి పెంచబడింది. రెండవ ప్రణాళిక యొక్క రెండు, మూడు సంవత్సరాలకాలంలో 52 పడకల ఉండే ఒక మెడికలు వార్డు, 8 పడకలు ఉండే ఒక రిససిటేషన్ వార్డు, ఒక పేడియాట్రిక్ వార్డు, ఒక మార్చ్యురీ, ఒక అడ్మినిస్ట్రేటివ్ కమ్ ఔట్ పేషంట్ బ్లాకు నిర్మించబడి నాయి. ఇంతేకాక హెచ్. టి. విద్యుచ్ఛక్తి సరఫరా సమకూర్చటం, 200 కె. వి. ఏ ట్రాన్స్ ఫార్మరును నెలకొల్పటం జరిగింది. ప్రసూతి వార్డులో 150 మంది స్త్రీలకు వసతి కల్పించటంకోసం వైద్యశాఖ వారి ఆధీనంలో ఉంచబడిన చీఫ్ ఇంజనీరు కార్యాలయ భవనాలలో అదనపు వసతిని కల్పించటానికి, మార్పులు చేయటానికిగాను రు 2 లక్షల మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళి కలో కేటాయించబడింది ఆసుపత్రిలోని పడకల సంఖ్యకూడ 350 నుండి 500 లకు పెంచబడుతుంది

## కర్నూలు వైద్య కళాశాల.

పరికరాల కొనుగోలుకు, లేబరేటరీ ఫిట్టింగులకు, అవసర సిబ్బంది నియామకానికి, వైద్యకళాశాల నెలకొల్ప బడిన సచివాలయపు భవనాలకు తగిన మార్పులు చేయటానికి, 1958-59 లో ప్రీ-ప్రొఫెషనల్ కోర్సులను ప్రారంభించటానికిగాను 1956-59 సంవత్సరాల కాలంలో రు. 12.5 లక్షల మొత్తం కేటాయించ బడింది. అదనపు పరికరాలను సమకూర్చటానికి, అదనపు సిబ్బందిని నియమించటానికి, ఆటస్థలాలను చదును చేయటానికి, అసెంబ్లీగాను, ఆడిటోరియంగాను ఉపయోగపడే భవనాన్ని నిర్మించటానికి గాను 1959—60 సంవత్సరానికి రు. 6 లక్షలు మొత్తం కేటాయించ బడింది.

## కాంపౌండర్లకు శిక్షణ.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు, యితర వైద్య సంస్థలకు కావలసివచ్చే కాంపౌండర్ల అవసరాన్ని తీర్చటంకోసం రెండవ ప్రణాళికాకాలంలో అదనంగా 495 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింప బడింది. జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులలోను, ఇతర టీచింగు ఆసుపత్రులలోను ఉన్న 11 శిక్షణ కేంద్రాలలో ఏటా 99 మందికి యీ శిక్షణ యివ్వబడుతుంది. అదే ప్రకారం 1956—57, 1958—59 సంవత్సరాల కాలంలో 297 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వబడింది. ఇంకా 99 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటం కోసం ఈ సంవత్సరంలో రు. 0.22లక్ష కేటాయించ బడింది. ఇందులో రు.0.02 లక్ష కర్నూలు జనరల్ ఆసుపత్రిలో 9మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటం కోసం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## మంత్రసానులకు శిక్షణ,

అదనంగా 90 మంది మంత్రసానులకు శిక్షణ యివ్వటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళిలో రు 1.23 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో 18 మంది మంత్రసానులకు రు. 0.25 లక్ష వ్యయంతో ఈ జిల్లాలోని నంద్యాలలో ఉన్న హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో శిక్షణ యివ్వబడుతుంది.

## నర్సులకు శిక్షణ.

ఈ పథకం క్రింద రెండవ ప్రణాళికా కాలంలో ఏటా 95 మంది నర్సులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఈ సంవత్సరం 95 మందితో కూడిన నాలుగవ జట్టు అభ్యర్థులు వివిధ శిక్షణ సంస్థలలో శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఇందుకోసం 1959—60 ప్రణాళికలో రు. 2.23 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0 60 లక్ష వ్యయంతో 25 మంది అభ్యర్థులకు కర్నూలులోని జనరల్ ఆసుపత్రిలో శిక్షణ యివ్వబడుతుంది.

## తాలూకా కేంద్రాలలోని ఆసుపత్రుల అభివృద్ధి.

ఆంధ్ర ప్రాంతపు తాలూకా కేంద్రాలలో ఉన్న ఆసుపత్రులలో పడకల సంఖ్యను హెచ్చించటం ద్వారాను అదనపు భవనాలను నిర్మించటం ద్వారాను

వాటిని అభివృద్ధిచేయటంకోసం రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్స రాల కాలంలో రు. 4.71 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడింది. తాలూకా ఆసుపత్రుల అభివృద్ధికిగాను ఈ సంవత్సరంలో రు. 1.60 లక్షలమొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఇందులో రు. 0.14 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. పడకల సంఖ్యను పెంచటం మూలంగా యీ జిల్లాలోని పంచ్యాలమొదలైన తాలూకా ఆసుపత్రులలో యింతకుముందు నియమించ బడిన సిబ్బందిని కొనసాగించడానికి, యింకాకొన్ని తాలూకా ఆసుపత్రులను ఈ సంవత్సరంలో అభివృద్ధిపరచటానికిగాను పై డబ్బు వినియోగించబడు తుంది.

## లోకల్ ఫండు ఆసుపత్రులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం.

ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.95 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.50 లక్ష యీ జిల్లాకు కేటాయించ బడింది. 1957—59 సంవత్సరాలలో స్వాధీనం చేసికో బడినట్టి ఎమ్మిగనూరు, ఆలూరులలోని ఆసుపత్రులను నిర్వహించడానికి, ఆళ్లగడ్డ, గిద్దలూరులలోని ఆసుపత్రులను స్వాధీనం చేసికోవడానికిగాను పై డబ్బు విని యోగించబడుతుంది.

## జిల్లా లేబరేటరీలు, ప్రాంతీయ లేబరేటరీలు

1957—59 సంవత్సరాలలో స్థాపించబడిన 2 ప్రాంతీయ లేబరేటరీలను, 2 జిల్లా లేబరేటరీలను నిర్వహించటమేగాక ఒక జిల్లా లేబరేటరీని క్రొత్తగా స్థాపించుటకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.72 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.16 లక్ష 1957—58లో కర్నూలులో ఏర్పాటు చేయబడిన ప్రాంతీయ లేబరేటరీని నిర్వహించటంకోసం ప్రత్యేకించబడింది.

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలోను ఆంధ్ర ప్రాంతంలో 10 క్షయ చికిత్సా కేంద్రాలు నెలకొల్పబడినాయి. ఈ సంవత్స రంలో యింకా 4 కేంద్రాలను ఏర్పాటు చేయడానికి, ఇంతకుముందు

ప్రారంభించిన వాటిని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష మొత్తం 1956—57 లో కర్నూలులోని జనరలు ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు.

దేశంలో త్వరితగతిని జనాభా పెరగటం మూలంగా దేశం యొక్క పరిమితమైన ఆదాయ మార్గాల పై అధికమైన ఒత్తిడి కలుగచేయబడుతున్నది. ఈ కారణాలవల్ల కుటుంబ నియంత్రణ, జనాభా పెరుగుదలను అరికట్టడం అవసర మయింది. ఇందువల్ల 1957—58 సంవత్సరాలలో ఆంధ్ర ప్రాంతంలో 13, తెలంగాణా ప్రాంతంలో 7— మొత్తం 20 కుటుంబ నియంత్రణ కేంద్రాలు స్థాపించ బడినాయి. ఈ సంవత్సరంలో యింకా 15 కేంద్రాలను-10 ఆంధ్రలోను, 5 తెలంగాణాలోను— ప్రారంభించటానికి, ఇంతకుముందు ప్రారంభించిన వాటిని కొనసాగించ టానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు 1959—60 ప్రణాళికలో రు. 0.66లక్ష కేటాయించబడింది, ఇందులో రు.0.06 లక్ష యీజిల్లాలో వినియోగించబడుతుంది. ప్రభుత్వ ఆసుపత్రిలో ఒకకుటుంబ నియంత్రణ కేంద్రాన్ని ఏర్పాటుచేయడానికి, కర్నూలు వైద్య కళాశాలలో 1958—59 లో ఏర్పాటు చేయబడిన కేంద్రాన్ని కొనసాగించేటందుకు యీ తబ్బు వినియోగించబడుతుంది.

## సహాయక నర్సు—మంత్రసానులకు శిక్షణ

సహాయకనర్సు - మంత్రసానుల శిక్షణకోసం యింతకు ముందు ప్రారంభించిన 5 కేంద్రాలను నిర్వహించటానికి, క్రొత్తగా మరో రెండు కేంద్రాలను ఈ సంవత్సరంలో ప్రారంభించటానికిగాను ప్రణాళికలో రు. 0.78 లక్ష కేటాయించబడింది, ఇందులో రు. 0.14 లక్ష కర్నూలులోని జనరల్ ఆసుపత్రిలో ఏర్పాటుచేయబడిన శిక్షణ కేంద్రాన్ని కొనసాగించటంకోసం ప్రత్యేకించబడింది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకం క్రింద, గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చటంకోసం బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో యీ పథకం క్రింద రు. 15.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.00 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలో 2 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన కేంద్రాలను కొనసాగించటానికీ పై డబ్బు వినియోగించబడుతుంది.

## దంత వైద్య కళాశాల, దంత చికిత్సా కేంద్రాల ఏర్పాటు

ఈ పథకం క్రింద ఈ సంవత్సరంలో రు. 8.06 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 3.50 లక్షల మొత్తం ఆంధ్ర ప్రణాళిక క్రింద, రు. 0.56 లక్ష తెలంగాణా ప్రణాళిక క్రింద కేటాయించబడినాయి. ఇంతకు ముందు ప్రారంభించిన దంత చికిత్సా కేంద్రాలను నిర్వహించటమే కాకుండా క్రొత్తవాటిని ప్రారంభించటానికి, హైదరాబాదులోని ఉస్మానియా వైద్య కళాశాలలో 1958—59 సంవత్సరంలో ఏర్పాటు చేయబడిన దంత చికిత్సా విభాగాన్ని కొనసాగించటానికిగాను యీ డబ్బు వినియోగించ బడుతుంది. ఇందులో రు. 0.22 లక్ష కర్నూలులోని జనరలు ఆసుపత్రిలో 1958—59లో ఏర్పాటు చేయబడిన దంత చికిత్సా విభాగాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## కుష్ఠు రోగ నివారణ

1957—58, 1958—59 సంవత్సరాలలో ప్రారంభించబడిన 4 కుష్ఠు వ్యాధి నివారణ సహాయక కేంద్రాలను కొనసాగించటానికి, క్రొత్తగా మరో 2 కేంద్రాలను ప్రారంభించటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.55 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష యీ జిల్లాలోని కర్నూలులో ఏర్పాటు చేయబడిన ఒక కుష్ఠువ్యాధి నివారణ కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## క్షయరోగులకు ప్రత్యేక పడకలు

క్షయ రోగులకుగాను ఈ సంవత్సరంలో 250 ప్రత్యేక పడకలను ఆంధ్రలో ఏర్పాటు చేయడానికి, యింతకుముందు ఏర్పాటు చేసినవాటిని నిర్వహించటానికిగాను రు. 5.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.70లక్ష కర్నూలులోని జిల్లాఆసుపత్రిలో క్షయరోగులకుగాను 50 ప్రత్యేక పడకలను ఏర్పాటుచేసే నిమిత్తం ప్రత్యేకించబడింది.

## ప్రత్యేక ఆహారం తయారీకి గాను గుంటూరు, కర్నూలులలో వంటశాలల ఏర్పాటు

1959—60 ప్రణాళికలో యీ పథకంక్రింద రు. 0.34 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.17 లక్ష 1957—58లో గుంటూరులోని జనరల్ ఆసుపత్రిలో ప్రత్యేక ఆహారం తయారుచేయుటకుగాను ఏర్పాటు చేయబడిన వంటశాలను కొనసాగించటానికిగాను ప్రత్యేకించబడింది. మిగత రు. 0.17 లక్ష కర్నూలులోని జనరల్ ఆసుపత్రిలో యీ సంవత్సరం ఇదే మాదిరి ఇంకో వంటశాలను ఏర్పాటు చేయుటకుగాను ప్రత్యేకించబడింది.

## సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలు

ఇంతకుముందు స్థాపించిన 5 సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలను కొనసాగించటానికి, యీ సంవత్సరం యింకా 3 కేంద్రాలను స్థాపించటానికిగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. 1957—58 లో కర్నూలులోని జనరలు ఆసుపత్రిలో స్థాపించబడిన సుఖవ్యాధి చికిత్సా కేంద్రం కొనసాగింపుకు పై డబ్బు వినియోగించబడుతుంది.

# ప్రజారోగ్యం

## దాయీలకు శిక్షణ.

గ్రామీణ ప్రాంతాలలో ఇండ్లలోనే కాన్పులు జరిగే పద్ధతిని మెరుగుపర్చటానికిగాను 1956—57 సంవత్సరంలో యీ శిక్షణపథకం ప్రారంభించబడింది.

పాటు మంత్రసానులకు (దాయీలు) ఉత్తమ పద్ధతుల్లో పురుళ్లు పోయటం గురించి యీ పథకం క్రింద శిక్షణ యివ్వడం జరుగుతుంది. ఇందువల్ల వారు తమవృత్తిని నైపుణ్యంతో కొనసాగించుకోటానికి వీలు కలుగుతుంది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలకాలంలో యీ పథకంక్రింద శిక్షణ యివ్వడం నిమిత్తం 1,829 మంది అభ్యర్థులు చేర్చుకోబడినారు. ఈ సంవత్సరంలో యీ పథకం కొనసాగించబడుతుంది ఇంకో 720 మంది అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఇందుకుగాను రాష్ట్ర ప్రణాళికలో రు. 0.81లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 4,500 లు యీ జిల్లాలో 60 మంది అభ్యర్థులకు దాయీలుగా శిక్షణ యిచ్చుటకు వినియోగించబడతాయి.

## మలేరియా బ్యూరో విస్తరణ

మొదటి ప్రణాళికాకాలంలో ప్రారంభించబడిన రెండు మలేరియా నివారణ యూనిట్లు 1956—57 లో కొనసాగించబడినాయి. 1957—58లో అదనంగా మరో రెండు యూనిట్లు ఏర్పాటు చేయబడినాయి. ఈ నాలుగు యూనిట్లుకూడా 40 లక్షల మంది ప్రజలను మలేరియా బారినుండి రక్షించటంకోసం 1958—59 లో కొనసాగించబడినాయి. 1—4—1958 నుండి మలేరియా నివారణకు సంబంధించిన జాతీయ కార్యక్రమము మలేరియా నిర్మూలన కార్యక్రమంగా మార్చబడింది. ఈ కార్యక్రమంక్రింద అదనంగా మందులు చల్లే పరికరాల్ని, డి. డి. టి. మందును సరఫరా చేయటంద్వారా మలేరియా వ్యాపించని ప్రదేశాలనుకూడా కలుపుకొని రాష్ట్రంలోని అన్ని తావులలోను మందులు చల్లేపని తీవ్రతరం చేయబడుతుంది. ప్రస్తుతము 17 సబ్-యూనిట్లతోకూడియున్న ప్రస్తుతపు 4 యూనిట్లను కొనసాగించటానికి, 16 హైపో-ఎండమిక్ యూనిట్లను స్థాపించడానికి, ప్రజారోగ్యశాఖ ప్రాంతీయ అసిస్టెంట్ డైరెక్టర్లనుముగ్గురిని నియమించడానికిగాను రాష్ట్రప్రభుత్వ వాటాక్రింద 1959-60 ప్రణాళికలో రు. 22.99 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 2.48 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ప్రస్తుతమున్న రెండు సబ్-యూనిట్లను కొనసాగించడానికి, ఒక హైపో-ఎండమిక్ యూనిట్టును ప్రారంభించడానికి యీ డబ్బు వినియోగించబడుతుంది.

## బి. సి. జి. టీకాలు

క్షయవ్యాధి నివారణకొరకు బి. సి. జి. టీకాలువేసే కార్యక్రమాన్ని ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఒక కేంద్ర పరిపాలక యూనిట్టుతోను 6 ఫీల్డు టీములతోను ప్రారంభించబడింది. మొదటి మూడు సంవత్సరాల్లోను యివి కొనసాగించబడినాయి. 1959—60లో పై కేంద్ర పరిపాలక యూనిట్టును, ఆరుఫీల్డు టీములను కొనసాగించటమేగాక అదనంగామరో 3 ఫీల్డు టీములను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదించబడింది. రాజ్య ప్రభుత్వ వాటా క్రింద ప్రణాళికతో యిందుకుగాను రు 3.70 లక్షలమొత్తం యీ సంవత్సరం కేటాయించబడింది. ఏర్పాటుచేయబడే మూడు ఫీల్డు టీములుకూడ యీ జిల్లాలో 6 నెలలపాటు పనిచేస్తాయి. ఇందుకు రు. 0.329 లక్ష కేటాయించబడింది.

## బలవర్ధక ఆహారాన్ని గురించి పరిశోధన

ప్రస్తుతం ప్రజలు తీసికొంటున్న భోజన రీతులనుగురించి పరిశోధించటానికి, వారు తీసికొంటున్న ఆహారంలో పుష్టి ఎంతకొరవడి ఉండేది నిర్ణయించటానికి, యీ లోపాలకుగురి అవుతున్నవారికి, తగు సంరక్షణ కల్పించటానికి, వారు బలవర్ధక ఆహారాన్ని తీసికొనేటందుకు సహాయపడటానికిగాను బలవర్ధక ఆహార పరిశోధనకు సంబంధించిన పథకం ఒకటి 1950 లో ఉమ్మడి మదరాసు రాష్ట్రం యొక్క ఆంధ్ర ప్రాంతంలో ఒక "రీజనల్ న్యూట్రిషన్" యూనిట్టును స్థాపించడంద్వారా అమలుపరచబడింది. 1956—57లో యీ యూనిట్టు కొనసాగించబడింది. ఇంతేకాక విశాఖపట్టణంలో "బెరి బెరి" వ్యాధికి సంబంధించిన పరిశోధనాపథకం ఒకటి భారత వైద్య పరిశోధన సంఘం మరియు రీసెర్చి కార్పొరేషన్‌వారి తోడ్పాటుతో ప్రారంభించబడింది. తరువాత యిది గుంటూరుకు మార్చబడింది. 1957—58 లో మరో ప్రాంతీయ "న్యూట్రిషన్ యూనిట్టు" కర్నూలు ప్రధానకార్యస్థానంగా ప్రారంభించబడింది. ఆంధ్ర ప్రాంతంలోని గుంటూరు, కర్నూలులలో ప్రస్తుతం ఉన్న యూనిట్లను, గుంటూరులో "బెరి బెరి" వ్యాధి పరిశోధన పథకాన్ని, 1957—58లో తెలంగాణాలోని వరంగల్లులో స్థాపించబడిన యూనిట్టును కొనసాగించటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 1.14

లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.30 లక్ష ప్రస్తుతం యీ జిల్లాలో ఉన్న "న్యూట్రిషన్ యూనిట్లు"ను కొనసాగించటానికిగాను ప్రత్యేకించబడింది.

## ఆరోగ్య ప్రచారం

ఆరోగ్య విషయాలనుగురించి ప్రజలకు వివరించేటందుకుగాను ప్రజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో కేంద్ర ఆరోగ్య విద్యా ప్రచారబ్యూరో ఒకటి 1957–58 లో ప్రారంభించబడింది. ఇంతకుముందుకొన్న 11 జీపులను, రెండు ఎపిడమిక్ కంట్రోలు మరియు ప్రచార వ్యానులను నిర్వహించడమేగాక మరో రెండు వ్యానులను కొనటం జరిగింది. క్రొత్తఢిల్లీలోని కార్యాచరణ సంఘం వారు 1958—59 లో యీ పథకాన్ని కొనసాగించుటకు సమ్మతించలేదు. అయినప్పటికి ప్రస్తుతము జిల్లాలలో ఉన్న 11 జీపులను, 4 వ్యానులను కొనసాగించటానికి, కేంద్ర ఆరోగ్య విద్యా బ్యూరోను కొనసాగించటానికి, యింకా 8 కొత్త వ్యానులను ఖరీదుచేయటానికి, మూడు ఆరోగ్యప్రచార బ్యూరోలను స్థాపించటానికిగాను 1959—60లో రు. 4.15 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.48 లక్ష యీ జిల్లాలో ఉన్న ఒక జీపు, ఒక వ్యాను నిర్వహణకు ఒక ఆరోగ్య విద్యాప్రచార బ్యూరోను ఏర్పాటుచేయటానికిగాను ప్రత్యేకించబడింది.

## విద్యార్థి ఆరోగ్య కేంద్రాలు

పాఠశాలల్లో చదువుకొనే పిల్లల సౌకర్యార్థం ప్రస్తుతమున్న 2 విద్యార్థి ఆరోగ్య కేంద్రాలను కొనసాగించటానికి, యింకా 2 కేంద్రాలను స్థాపించటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.37 లక్షలమొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.58 లక్ష యీ జిల్లాలో ఒక విద్యార్థి ఆరోగ్య కేంద్రాన్ని ఏర్పాటుచేసే నిమిత్తం వినియోగించబడుతుంది.

# గ్రామీణ, పట్టణ నీటి సరఫరా

## పట్టణ నీటిసరఫరా, మురుగు పారుదల పథకాలు

స్థానిక సంస్థలకు సంబంధించిన పట్టణ నీటిసరఫరా, మురుగు పారుదల పథకాలకోసం భారత ప్రభుత్వంవారు రు. 102.446 లక్షల మొత్తాన్ని

(రు. 32.446* లక్షల మొత్తం కేంద్ర ప్రణాళిక క్రింద, రు. 20-00 లక్షల మొత్తం రాష్ట్ర ప్రణాళిక క్రింద) ఋణసహాయంగా యిస్తారని ఆశించబడుతున్నది. ఇందులో రు. 41-270 లక్షల మొత్తం కార్పొరేషను పథకాలకుగాను ప్రత్యేకించబడింది. మిగతా మొత్తంలో రు. 10.500 లక్షల మొత్తం క్రింది పథకాలకుగాను యీ జిల్లాలో వినియోగించబడుతుంది.

| | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం, (రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 1. | కర్నూలు సిటీనీరసరఫరా అభివృద్ధిపనులు | 0.500 |
| 2. | ఆదోని నీటిసరఫరా అభివృద్ధిపనులు(మొదటిదశ) | 10.00 |
| | మొత్తం | 10.500 |

## గ్రామీణ నీటి సరఫరా, పారిశుద్ధ్యం పథకాలు

గ్రామీణ ప్రజలకు పరిశుభ్రమైన మంచినీటి సౌకర్యాన్ని, పారిశుధ్య సౌకర్యాన్ని కలిగించటానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో ఆంధ్రకు రు. 10.94 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ కార్యక్రమాన్ని తీవ్రం చేయటం కోసం మొదటి ప్రణాళికా కాలంలో ఏర్పాటు చేయబడిన క్రింది నాలుగు యూనిట్లను కొనసాగించుటకుగాను పై మొత్తంలో రు. 5.49 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది. పై నాలుగు యూనిట్లలోను 459 గ్రామాలున్నాయి.

1. విశాఖపట్టణం జిల్లాలో ఉన్న విశాఖపట్టణం యూనిట్టు.
2. గుంటూరు జిల్లాలోని మాచెర్ల యూనిట్టు.
3. అనంతపురం జిల్లాలోని కదిరి యూనిట్టు.
4. కర్నూలు జిల్లాలోని పత్తికొండ యూనిట్టు.

*ఇందులో రు. 5.446 లక్షల మొత్తం, యీ పథకానికిగాను 1957—58 సంవత్సరంలో కేటాయించబడిన మొత్తంలో ఖర్చుపెట్టబడకుండా మిగిలిపోయినట్టిది.

మిగిలిన రు. 10.85 లక్షల మొత్తంలో రు. 2.61 లక్షల మొత్తం యీ జిల్లాలోని శ్రీశైలం నీటిసరఫరా పథకానికిగాను ప్రత్యేకించబడింది.

# గృహనిర్మాణం

## పారిశ్రామిక గృహ నిర్మాణ పథకం

భారత ప్రభుత్వంవారు ఋణాల రూపంలోను, సబ్సిడీల రూపంలోను యిచ్చే ఆర్థిక సహాయంతో యీ పథకంక్రింద పారిశ్రామిక కార్మికులకు యిళ్లు నిర్మించటానికి తలపెట్టబడింది. ఈ పథకంక్రింద రెండు రకాల యిళ్లు నిర్మించబడతాయి. ఒక్కగది యిళ్లు ఒక్కొక్కటి రు. 3,300 లు ఖర్చుతోను, రెండుగదుల యిళ్ళు ఒక్కొక్కటి రు. 3,850 ల ఖర్చుతోను నిర్మించబడతాయి. పై మొత్తంలో భూమి ఖరీదు, అభివృద్ధి పనులకయ్యే ఖర్చుకూడ చేరుతుంది. అయితే నీటిసరఫరా, పారిశుధ్యం, విద్యుచ్ఛక్తి సరఫరా మొదలగు సౌకర్యాల కయ్యేఖర్చు యిందులో చేరదు. ఈ పథకంక్రింద ఇండ్ల నిర్మాణాన్ని కొనసాగింపనిమిత్తం 1959—60 ప్రణాళికలో రు. 21.88 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బుతో, మంచిర్యాలలో 50 యిళ్లు, బుగ్గనపల్లిలో 110 యిండ్లు విశాఖపట్టణంలో 150 యిళ్లు, గుంటూరులో 150యిళ్లు, గుంతకల్లులో 100యిళ్లు, రాజమండ్రిలో 100 యిళ్లు, ఏలూరులో 100 యిళ్లు నిర్మించడం, ప్రారంభించబడుతుంది.

## పట్టణాల్లో గృహనిర్మాణం—సహకార సంఘాలు

పట్టణ ప్రాంతాల్లో నివాస గృహాల కొరతను తీర్చటంకోసం సహకార పట్టణ గృహనిర్మాణం సంఘాల సభ్యులకు ఇళ్లు నిర్మించుకొనేటందుకుగాను దీర్ఘకాలికఋణాలు యివ్వటానికి యీ పథకంక్రింద ప్రతిపాదించబడింది. ఆంధ్రలో క్రొత్తగా 340 గృహాల నిర్మాణం నిమిత్తం ఋణాలివ్వటంకోసం ఈ సంవత్సరంలో రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.60 లక్షల మొత్తం యీ జిల్లాలో 27 గృహాలనిర్మాణం నిమిత్తం ప్రత్యేకించబడింది.

# కార్మికులు - కార్మిక సంక్షేమం

## ఉద్యోగ సమాచార సేకరణ

ఈ పథకం యొక్క లక్ష్యాలేవంటే:

1. ఏరకం ఉద్యోగులు కొరతగా ఉన్నారన్న విషయాన్నియింకా ఖచ్చితంగా నిర్ణయించటం కోసం ఉద్యోగసాధక కేంద్రాల అధికారులకు యింకా ఎక్కువవివరాలను అందచేయటం.

2. విద్యాభ్యాసం పూర్తి చేసినవారికి, ఉద్యోగాన్వేషణలో ఉన్న యితర వ్యక్తులకు ఉద్యోగాలనుగురించి, ఉద్యోగావకాశాలను గురించి సలహాలిచ్చే నిమిత్తం సమాచారాన్ని లభ్యంచేయటం.

3. ఉద్యోగ సాధక కేంద్రం యొక్క పరిధిలో ఉండే ప్రాంతంలో గాని లేక ప్రత్యేక ఎంప్లాయిమెంటు మార్కెట్లుగా ఏర్పాటు చేయబడే ఇతర ప్రదేశాలలోగాని ఉద్యోగ నియమావకాశాలలో వచ్చేమార్పులను గమనించడానికి తగినవిధానాన్ని రూపొందించటం.

4. ప్రతిపరిశ్రమలోను, వృత్తిలోను ఉద్యోగ నిరుద్యోగరీతులను గురించి ప[illegible] సూచనలు చేయటం.

హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం, విజయవాడ, కర్నూలులలోని ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాలలో యీ పథకం 1957—58 లో అమలు పరచబడింది. హైదరాబాదులోని నేషనల్ ఎంప్లాయిమెంట్ సర్వీస్ డైరక్టరేట్ లో కేంద్రయూనిట్టు ఏర్పాటుచేయబడింది. 1958—59 లో కాకినాడ, గుంటూరు, నిజామాబాదులలోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు యీ పథకం విస్తరించ బడింది. విశాఖపట్టణం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులలో ప్రయివేటు రంగానికి సంబంధించి 1959—60 లో పరిశీలన జరిపేటందుకు ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను నేషనల్ ఎంప్లాయ్‌మెంట్ సర్వీస్ డైరక్టరేటులో ఏర్పాటుచేయబడిన కేంద్రయూనిట్టు ఒక సీనియరు ఆఫీసరు అధ్వర్యంలో ఉంచబడడం ద్వారా పటిష్ఠం చేయబడుతుంది. ఇంతేకాక పైన పేర్కొనబడిన ఉద్యోగ సాధక కేంద్రాలతోకూడ అదనపు సిబ్బంది నియమించబడుతుంది. ప్రతిఉద్యోగ సాధక కేంద్రంలోను ఒక గుమాస్తాను నియమించడం ద్వారా మిగత అన్ని కేంద్రాలలోని సిబ్బందినికూడ పెంచటానికి ప్రతిపాదింప బడింది.

ఈపథకాని కయ్యే ఖర్చులో రాష్ట్ర ప్రభుత్వ వాటాక్రింద 1959—60 ప్రణాళికలో రు. 0.31 లక్ష కేటాయించ బడింది. కేంద్ర ప్రభుత్వం వాటా క్రింద రు. 0.47 లక్ష కేటాయించ బడింది. కేటాయించబడిన మొత్తం రు. 0.78 లక్షలో రు. 0.014 లక్ష ఈ జిల్లాలోని కార్యక్రమమునకు గాను వినియోగించ బడుతుంది.

### యువకులు ఉద్యోగాలను పొందటంలో సహాయ పడటం; ఉద్యోగాలను గురించి సలహాలివ్వటం (యూత్ ఎంప్లాయి మెంటు సర్వీసు అండ్ కౌన్సిలింగు)

భారత ప్రభుత్వంవారిచే నియమించబడిన ట్రైనింగు, అండ్ ఎంప్లాయ్ మెంటు ఆర్గనైజేషన్ కమిటీవారు వృత్తివిద్యా విషయాలలో సలహాలను యిచ్చుటకు తగిన సౌకర్యాలను కలిగించటానికి "ఎంప్లాయ్ మెంటు సర్వీసును" స్థాపించవలసిన అవశ్యకతను గురించి నొక్కిచెప్పారు. ఇందువల్ల 1959—60లో విజయవాడ, గుంటూరు, కర్నూలులలో మూడు యూత్ ఎంప్లాయిమెంటు సర్వీసు అండ్ కౌన్సిలింగు యూనిట్లను స్థాపించటానికి ప్రతిపాదింప బడింది. యువకులు తమ అభిరుచులకు, దేహోదారుఢ్యతకు, విద్యార్హతలు మొదలైన వాటికి తగిన ఉద్యోగాలను ఎన్నుకోవటంలో "యూత్ ఎంప్లాయిమెంటు సర్వీసు" తోడ్పడుతుంది. "ఎంప్లాయిమెంటు కౌన్సిలింగు" కూడ పయోజనులకు సంబంధించి యివేపనులను నిర్వహిస్తుంది. కేటాయించబడినరు. 0.135 లక్షలో (రు. 0.05 లక్ష రాష్ట్ర ప్రభుత్వ వాటాక్రింద, రు. 0.085 లక్ష కేంద్ర ప్రభుత్వ వాటాక్రింద) రు. 0.045 లక్ష యీ జిల్లాలోని కర్నూలులో ఒక యూనిట్టును స్థాపించుటకుగాను ప్రత్యేకించబడింది.

# వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులాల సంక్షేమం

## షెడ్యూల్డు కులాలు

### షెడ్యూల్డుకులాలవారికి స్కాలరు షిప్పులు

షెడ్యూల్డు కులాలవారికి, అర్హులైన యితర కులాల విద్యార్థులకుకూడ ఈ పథకంక్రింద అన్ని విద్యాదశలలోను స్కాలరు షిప్పులు యివ్వబడుతు

న్నాయి. హైస్కూలు విద్యార్థుల విషయంలో వారి తలిదండ్రుల ఆదాయం రు. 1,500 లకు మించనప్పుడు, కాలేజి విద్యార్థుల విషయంలో వారి తలిదండ్రుల ఆదాయం 1,800 లకుమించనప్పుడు వారికి పూర్తి జీతం మినహాయింపు కలుగచేయబడుతున్నది. అదనంగా దాదాపు 1,600 స్కాలరు షిప్పులు యివ్వడానికి, ఇంతకుముందే మంజూరుచేసిన వాటిని కొనసాగించటానికిగాను 1959—60 సంవత్సరానికి రు. 4.90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని అర్హులైన విద్యార్థులకుకూడ యీ స్కాలరు షిప్పులు లభ్యమవుతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి సబ్సిడైజుడు హాస్టళ్ళు

ఆంధ్ర ప్రాంతంలో 438 సబ్సిడైజుడు హాస్టళ్లు ఉన్నాయి. వెనుకబడిన తరగతులకు, హరిజన కులానికి చెందిన విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు పటా యివ్వబడుతున్నాయి. ఒక్కొక్క విద్యార్థికి విద్యా సంవత్సరానికి రు. 150 లు గ్రాంటుగా ఇవ్వబడుతున్నది. అదనంగా యింకా 670 బోర్డింగు గ్రాంటులను యివ్వటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.00 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని హాస్టళ్లకు కూడ బోర్డింగు గ్రాంటులు యివ్వబడతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి ప్రభుత్వ హాస్టళ్లు

ఈ జిల్లాలోని పాణ్యంలో ఉన్న హాస్టలు రు. 0.176 లక్ష వ్యయంతో 1959—60లోనిర్వహించబడుతుంది.

## పాఠశాలలు, హాస్టళ్ల భవనాల నిర్మాణం; వాటికి మరమ్మతులు

ఆంధ్ర ప్రాంతంలో సాంఘిక సంక్షేమ శాఖవారి అజమాయిషీక్రింద నిర్వహించబడుతున్న సాంఘిక సంక్షేమ పాఠశాలలు, సబ్సిడైజుడు హాస్టళ్లు అద్దె భవనాల్లో ఏర్పాటు చేయబడ్డాయి. ఇందువల్ల హరిజనుల కొరకు ప్రత్యేకంగా నిర్వహించబడుతున్న సాంఘిక సంక్షేమ పాఠశాలలకు, సబ్సిడైజుడు హాస్టళ్లకు పక్కా భవనాలను నిర్మించటానికి ప్రతిపాదించబడింది. 25 పాఠశాల భవనాల నిర్మాణం నిమిత్తం 1959—60 ప్రణాళికలో రు. 1.00లక్ష కేటాయించబడింది.

ఇందులో 3 భవనాలు యీ జిల్లాలో రు. 0.10 లక్ష వ్యయంతో నిర్మించ బడతాయి.

## పారిశుద్ధ్య సౌకర్యాల ఏర్పాటు

హరిజనవాడలు సామాన్యంగా అపరిశుభ్రంగా ఉంటాయి. ఈ వాడలను ఆరోగ్యకరంగా చేయటానికి బాటలు, మురుగుదొడ్లు, స్నానపుగదులు, మంచినీటి బావులు మొదలయినవాటిని ఏర్పాటుచేయటం అవసరం. ఇందుకుగాను ఆంధ్ర ప్రాంతంలో 217 మంచినీటి బావులను త్రవ్వటానికి 1959–60లో రు. 4.34 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో యీ జిల్లాలో 20 బావులు రు. 0.40 లక్ష వ్యయంతో త్రవ్వబడతాయి.

## ఇళ్ల స్థలాల సేకరణ

ఈ పథకం క్రింద ఇళ్ల స్థలాలను సేకరించి వాటినిఉచితంగా హరిజనులకు యివ్వటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 8.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.75 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ప్రచారం

అస్పృశ్యతను నిర్మూలించటంకోసం దానివల్ల కలిగే అనర్థాలను గురించి ప్రచారం చేయడానికి, దీటికి సంబంధించి వ్రాయబడిన ఉత్తమమయిన నాటకాలకు, యక్షగానాలకు బహుమతుల నివ్వటానికి, పత్రికలకు సబ్సిడీలు, ఇవ్వటానికి, పోస్టర్లు, కరపత్రాలను, ముద్రించటానికి, హరిజన దినోత్సవాలు, వర్ణాంతర భోజనాలు ఏర్పాటు చేయటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.40 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలో యీ పథకాన్ని అమలు పరచటంకోసం రు. 0.035 లక్ష ప్రత్యేకించబడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

హరిజన సేవక సంఘము, భారత సేవక సమాజము, గిల్డ్ ఆఫ్ సర్వీసు రెడ్ క్రాస్ సొసైటీ, రోటరీ క్లబ్బులు మొదలయిన అనేక స్వచ్ఛంద సంస్థలు

హరిజనోద్ధరణకు పాటు పడుతున్నాయి. ఈ సంస్థలకు తగు ప్రోత్సాహం యిచ్చేటందుకు ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.60 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలుకూడ యీ సహాయాన్ని పొందవచ్చు.

## గృహనిర్మాణ పథకం

హరిజనులు ఎంత బీదవారంటే వారికి యిళ్ల స్థలాలను ఉచితంగా యిచ్చినప్పటికీ యిళ్లు స్వంతంగా కట్టుకోలేని స్థితిలో ఉన్నారు. ఇందువల్ల హరిజనులు యిళ్లు కట్టుకొనేటందుకు వారికి సబ్సిడీలను, ఋణాలను యివ్వటానికి ప్రతిపాదింపబడింది. ఒక్కొక్క యింటికి రు. 750లు ధన సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 250 లు సబ్సిడీగాను, రు. 500 లు ఋణంగాను యివ్వడం జరుగుతుంది. అయితే యీ సౌకర్యం పొందే ప్రతివ్యక్తి కొంత లేబరుని, సామాగ్రిని సమకూర్చుకొనవలసి ఉంటుంది. వాటివిలువ పై మొత్తంలో చేరదు. హరిజనులతోకలిసి నివసించేటందుకు యితర కులాలవారిని ప్రోత్సహించేనిమిత్తం. నిర్మించటానికి తలపెట్టిన ఇండ్లలో నూటికి 10 యిళ్లు వెనుకబడిన తరగతులవారికి ప్రత్యేకించబడుతున్నాయి. ఈ జిల్లాలో 54 యిళ్లను నిర్మించటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.48లక్ష కేటాయించబడింది.

## వెనుకబడిన తరగతులు

### వెనుకబడినతరగతుల విద్యార్థులకు స్కాలరుషిప్పులు

వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు స్కాలరుషిప్పులు యివ్వటంకోసం రాజ్యప్రభుత్వంవారు ఏటా రు 4.00 లక్షలు ఖర్చుచేస్తున్నారు. ఆంధ్ర ప్రాంతంలోని వివిధ పాఠశాలల్లోను కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల విద్యార్థులకు అదనంగా దాదాపు 920 స్కాలరుషిప్పులు యివ్వటంకోసం ఈ సంవత్సరానికి రు. 2.74 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడినతరగతుల విద్యార్థులకుకూడ యీ స్కాలరుషిప్పులు లభ్యమవుతాయి

## వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు

ఉన్నత పాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు నల్విసైజుడు హాస్టళ్లలో బోర్డింగు గ్రాంట్లు యివ్వబడుతున్నాయి. ఒక్కొక్క విద్యార్థికి విద్యా సంవత్సరానికి రు. 150 లు చొప్పున యీ బోర్డింగు గ్రాంటులు యివ్వబడతాయి. అదనంగా 445 బోర్డింగు గ్రాంటులు మంజూరు చేయటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.67 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకుకూడ యీ బోర్డింగు గ్రాంటులు లభ్యమవుతాయి.

## వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకు మధ్యాహ్న భోజనం

సాంఘిక సంక్షేమ శాఖవారిచే నిర్వహింపబడుతున్న పాఠశాలలలో వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలు చేరటాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా అస్పృశ్యతా నివారణకు దోహదం చేసేటందుకుగాను రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభించబడిననాటినుండి సాంఘిక సంక్షేమశాఖ పాఠశాలల్లో చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల పిల్లలకు మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేయబడింది. ఈ పథకంకోసం 1959—60 లో రు. 0.50 లక్ష ఖర్చు పెట్టటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకుకూడ యిందుమూలంగా లాభం చేకూరుతుంది.

## విముక్త జాతులు

### విద్య

విముక్త జాతులకు చెందిన పిల్లల తలిదండ్రులు తమ పిల్లల విద్యకు కావలసిన సదుపాయాలను కలుగచేసే స్థితిలో లేనందువల్ల యీ పిల్లలు పాఠశాలలకు హాజరు కారు. ఇందువల్లయీ పిల్లలకు పుస్తకాలు, పలకలు మొదలగునవి సరఫరా చేయటానికి, స్కాలరు షిప్పులు మంజూరుచేయటానికి, యింతేకాక చిత్తూరు జిల్లాలో విముక్త జాతులవారికోసం నిర్మించబడిన కాల

సిలలో ఏర్పాటు చేయబడిన రెండు పార్కులను. రెండు రేడియో సెట్లను నిర్వహించటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.08 లక్ష కేటాయించ బడింది. ఈ జిల్లాలోని విముక్తజాతులకు చెందిన పిల్లలకుకూడ యీ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## గృహనిర్మాణం

విముక్తజాతులవారు తమ నివాస గృహాలను నిర్మించుకోవటానికి యీ పథకంక్రింద సహాయం చేయబడుతుంది. వారు తమ పాకలను క్రొత్తగా నిర్మించుకోదలచినట్లయితే రు. 100 ల విలువచేసే నిర్మాణ సామగ్రి సరఫరా చేయబడుతుంది. ప్రస్తుతమున్న యిళ్లనే వారు మరమ్మతు చేసికోదలచి నట్లయితే ప్రతి కుటుంబానికి రు. 30 లు నగదు రూపంలో చెల్లించబడుతుంది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 100 క్రొత్త యిళ్ల నిర్మాణానికి, 100 పాత యిళ్ల మరమ్మతులకుగాను రు. 0.18 లక్ష కేటాయించబడింది.

## ప్రజారోగ్యం

ఈ జిల్లాలో ఒక క్రొత్తబావిని త్రవ్వటానికి, ఒక మరుగుదొడ్డిని నిర్మించటానికి 1959—60 ప్రణాళికలో రు. 0.03 లక్ష కేటాయించబడింది.

## వ్యవసాయం చేసుకోవటానికి సహాయం

ఈ పథకంక్రింద విముక్తజాతులవారికి ఆర్థికంగా సహాయపడేటందుకు వారిని వ్యవసాయంలో స్థిరపరచేటందుకుగాను వారికి కాడి ఎద్దులను సరఫరా చేయటానికి, పంపుసెట్లను నెలకొల్పటానికి, పాత బావుల మొదలయినవాటికి మరమ్మతులు చేయటానికి ప్రతిపాదించబడింది. ఈ జిల్లాకు 4 జతల కాడి ఎద్దులను సరఫరా చేయటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 1,200 లు కేటాయించబడినాయి.

## కుటీర పరిశ్రమలు

విముక్తజాతులవారు తమ వృత్తులను కొనసాగించుకోవటంకోసం యీ పథకంక్రింద వారికి సహాయం చేయబడుతుంది. పరికరాలు, పనిముట్లు,

ముడిపదార్థాల రూపంలో ప్రతివ్యక్తికి రు. 50ల వరకు యీ సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.15 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 1,750లు యీ జిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఇందుమూలంగా 35 మందికి లాభం చేకూరుతుంది.

## వైద్య సహాయం

ఈ పథకంక్రింద, విముక్త జాతులకు చెందిన వ్యాధిగ్రస్తులయినట్టి అర్హులైన 50మంది వ్యక్తులకు "డిస్క్రిషనరీ" గ్రాంటులు యివ్వబడతాయి. పై వ్యక్తులు తమకు కావలసిన మందులనుకొనుక్కోవటానికి, యితరఖర్చులకుగాను ఒక్కొక్కరికి రు. 40/-లు చొప్పున యీ గ్రాంటు యివ్వబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 240లు యీజిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఈ జిల్లాలో విముక్త జాతులకుచెందిన 6 మందికి "డిస్క్రిషనరీ" గ్రాంటులు యివ్వటంకోసం యీ డబ్బు వినియోగించబడుతుంది.

# షెడ్యూల్డు తెగల సంక్షేమం

## చెంచుల సంక్షేమము

### దోర్నాలలో చెంచువారికి పాఠశాల, హాస్టల్లు

చెంచుతెగల పిల్లలకు విద్యా సౌకర్యాలను కలిగించే ఉద్దేశంతో కర్నూలు జిల్లాలోని దోర్నాలలో 1956—57 లో ఒక పాఠశాల, ఒక హాస్టలు ప్రారంభించబడినాయి. ఈ సంవత్సరంకూడ యివి కొనసాగించబడతాయి. ఇందుకు 1959—60 ప్రణాళికలో రు. 0.11 లక్ష కేటాయించబడింది.

### దోర్నాలలో సంచార వైద్యదళం ఏర్పాటు

నల్లమల్ల కొండలలో అక్కడక్కడా ఉన్న గూడెంలలోని రోగులకు వైద్యం చేయడంకోసం 1957—58 లో ఒక సంచార వైద్యదళం ప్రారంభించ

బడింది. రు. 0.16 లక్ష వ్యయంతో యిది 1959—60 లో కొనసాగించబడుతుంది.

## ఏజెన్సీ ప్రాంతాల్లో రేడియో సెట్ల స్థాపన

ఇంతకుముందే స్థాపించబడిన రేడియో సెట్లు నిర్వహణకగాను 1959—60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 0.0013 లక్ష కేటాయించబడింది.

## సహకారం

### ఆత్మకూరు సహకార సంఘం అభివృద్ధి

చెంచుల సౌకర్యార్థం కర్నూలు జిల్లాలోని ఆత్మకూరులో కొనుగోలు—అమ్మకం సంఘమొకటి ఏర్పాటు చేయబడింది. ఈ సంఘంలో నియమించబడిన సిబ్బంది ఖర్చుక్రింద, భవనాలు, గిడ్డంగులు నిర్మాణానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.30 లక్ష కేటాయించబడింది. రు. 40,000లు విలువచేసే గృహావసర వస్తువులు సరఫరాచేయబడతాయి. కొండతెగల ప్రజలనుండి రు. 11,000 విలువచేసే అటవీ ఉత్పత్తులు ఖరీదు చేయబడతాయి.

### దోర్నాలలో కొనుగోలు—అమ్మకం సహకార సంఘం ఏర్పాటు

చెంచులకు ఉపయోగపడేటందుకుగాను 1956—57లో కర్నూలు జిల్లాలోని దోర్నాలలో కొనుగోలు—అమ్మకం సహకార సంఘమొకటి ఏర్పాటు చేయబడింది. సిబ్బంది ఖర్చుక్రింద, భవనాలు, గిడ్డంగుల నిర్మాణానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.27 లక్ష కేటాయించబడింది. 1959—60లో రు. 20,000 లు విలువచేసే గృహావసర వస్తువులు సరఫరా చేయబడి కొండతెగలవారినుండి రు. 8,300లు విలువచేసే అటవీ ఉత్పత్తులు ఖరీదు చేయబడతాయని ఆశింపబడుతున్నది.

## స్త్రీ సంక్షేమం

### కర్నూలుజిల్లాలో చెంచులకుగాను స్త్రీ సంక్షేమ కేంద్రాలను ప్రారంభించటం

చెంచు స్త్రీలకోసం కర్నూలు జిల్లాలో ఒక స్త్రీ సంక్షేమ కేంద్రం ప్రారంభించటంకోసం 1959—60 ప్రణాళికలో రు. 0.10 లక్ష కేటాయించబడింది.

### స్వచ్ఛంద సంస్థలకు సహాయం

ఆంధ్ర ప్రాంతంలోని ఏజెన్సీ ప్రదేశాల్లో సంక్షేమ కార్యక్రమాల్ని కొనసాగిస్తున్న స్వచ్ఛంద సంస్థలకు ఆర్థిక సహాయం అందచేయటంకోసం 1959—60 లో రు. 0 90 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలకుకూడ యీ పథకంక్రింద సహాయం లభిస్తుంది.

## స్త్రీ సంక్షేమం

### ప్రస్తుతమున్న స్త్రీ సంక్షేమశాఖ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమశాఖ కార్యక్రమాలను తీవ్రంచేయటానికి, అవి మరింత ప్రయోజనకరంగా ఉండేటట్లు చేయటానికిగాను దృశ్యశ్రవణ పరికరాలు, సౌండు ప్రొజెక్టర్లు, విద్యాబోధన పటాలు, కెమేరాలు, రేడియోలు, సైకిళ్లు కుట్టుమిషనులు మొదలయినటువంటి పరికరాలను, యితర ముఖ్య సామాగ్రిని ఆంధ్రలో ప్రస్తుతమున్న 12 స్త్రీ సంక్షేమశాఖ విభాగాలకు రు. 0.10 లక్ష వ్యయంతో 1959—60 లో సరఫరా చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 1,000లు ఈ జిల్లాకు కేటాయించబడినాయి.

### అరుంధతి శరణాలయం, మహిళామండలి, కర్నూలు జిల్లా

కర్నూలు జిల్లాలోని ఆళ్ళగడ్డలో ఉన్న మహిళామండలికి అనుబంధించబడి ఒక సేవాకేంద్రం 1958—59 లో ప్రారంభించబడింది. ఈ కేంద్రాన్ని నిర్వహించటంకోసం యీ సంస్థకు గ్రాంటు యివ్వబడింది. ఈ సేవాకేంద్రంలో 20 మంది అభ్యర్థులు 1958—59లో చేర్చుకోబడినారు. ఇది యీ సంవత్సరంకూడ కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. అందుకు రు. 0.11 లక్ష కేటాయించబడింది.

## సాంఘిక సంక్షేమం

### సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రాలు

ప్రస్తుతమున్న 2 సంక్షేమ విస్తరణ కేంద్రాలను నిర్వహించటానికి, ఈ జిల్లాలో మొదటిదశ బ్లాకుల్లో అదనంగా ఒక కో-ఆర్డినేటెడ్ ప్యాటర్న్

సంక్షేమవిస్తరణ కేంద్రాన్ని యీ జిల్లాలో నెలకొల్పడానికి అయ్యే ఖర్చులో రాజ్యప్రభుత్వ వాటాక్రింద ఈసంవత్సరానికి రు. 0.386 లక్ష కేటాయించబడింది. వీటికయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు, రాజ్యప్రభుత్వం 5:12:6 నిష్పత్తిలో భరిస్తాయి ప్రజలనుండి సేకరించబడె మ్యాచింగ్ కంట్రిబ్యూషన్లుకూడ యిందుకు తోడవుతాయి.

## సాంఘిక, నైతిక పునరుద్ధరణ కార్యక్రమాలు

కరెక్షనల్ ఇనిస్టిట్యూషన్సు నుండి విడుదల అయ్యే స్త్రీలకుగాను రాజ్యస్థాయిలో ఒక సదనాన్ని నెలకొల్పేటందుకు, 14 జిల్లా ఆశ్రయ కేంద్రాలను (3 మగవారికి, 11 స్త్రీలకు) నెలకొల్పేటందుకు, యింతేకాక రాజ్యంలో యిదివరకే నెలకొల్పబడిన రాజ్యస్థాయిలోని సదనాలను జిల్లా ఆశ్రయ కేంద్రాలను కొనసాగించేటందుకు అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటాక్రింద 1959—60 ప్రణాళికలో రు. 6.32 లక్షల మొత్తం కేటాయించబడింది ఇందులో రు. 1.673 లక్షల మొత్తం యీ జిల్లాకు వ్యయించబడింది. ఈ జిల్లాలో స్త్రీలకుగాను ఒక జిల్లా ఆశ్రియ కేంద్రాన్ని, కరెక్షనల్ ఇనిస్టిట్యూషన్లనుండి విడుదల చేయబడే స్త్రీలకుగాను ఒక రాజ్యస్థాయి సధనాన్ని ఏర్పాటుచేయుటకు పైడబ్బు వినియోగించ బడుతుంది.

# మునిసిపల్ రోడ్లు, అభివృద్ధి పనులు

మునిసిపాలిటీలయొక్క, రెండుపట్టణ పంచాయితీలయొక్క ఆదాయ మార్గాలను అభివృద్ధిచేసే ఉద్దేశంతోను, ప్రజలకు పౌరసౌకర్యాలను అదనంగా సమకూర్చే ఉద్దేశంతోను దీర్ఘకాలిక ఋణాలరూపంలో ఆర్థికసహాయం చేసేటందుకుగాను రెండవప్రణాళికలో రు. 47.54 లక్షలమొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 21.42 లక్షలమొత్తం మొదటి మూడుసంవత్సరాల కాలంలో ఖర్చుపెట్టబడింది. ఈ సంవత్సరానికిగాను రు. 11.59 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష 1958—59 లో టౌనుప్లానింగు డైరక్టర్ కార్యాలయంలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించటానికి వినియోగించబడుతుంది. మిగత రు. 11.44 లక్షల మొత్తంలో రు.

0.55 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. అప్పుమొత్తం, అప్పుయివ్వబడే స్థానిక సంస్థపేరు, ఎందునిమిత్తం యీ అప్పు యివ్వబడుతున్నది.—యీ వివరాలు ప్రక్కపుటలో యివ్వబడినాయి.

| స్థానిక సంస్థపేరు | పని పేరు | అప్పు మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| ఆదోని పురపాలక సంఘం | మునిసిపల్ ట్రావెలర్స్ బంగళాకు పడమటి వైపున 22 అంగళ్ళవరుస నొకదానిని నిర్మించటం. | 0.50 |
| పార్ల పంచాయతి | ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని నిర్మించటం. | 0 05 |
| | మొత్తం | 0 55 |

# రేడియో ప్రసారం

## కమ్యూనిటీ రేడియో సెట్ల స్థాపన, నిర్వహణ

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో 440 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో 259 సెట్లుమాత్రం 1956—59 సంవత్సరాల కాలంలో యీ జిల్లాలో నెలకొల్పబడినాయి ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 68 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి, 1-4-1959 తేదీకి పూర్వం నెలకొల్పబడిన అన్ని సెట్లనూ నిర్వహించడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.327 లక్ష మొత్తం కేటాయించబడింది.

# ప్రచారం

రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలుపరచటం కోసం ప్రణాళికను గురించి ప్రజలలో శ్రద్ధాసక్తులు కలిగేటట్లు చేసేటందుకు, వారి

సంపూర్ణసహకారాన్ని పొందేటందుకు, వారు యీ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొనేటట్లు చేసేటందుకుగాను వివిధ ప్రచార సాధనాల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలనుగురించి ప్రచారంచేయుటం కోసం 1956—57 లో ఏకీకృత కార్యక్రమం ఒకటి ప్రారంభించ బడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించ టానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.80 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 18,599 లు యీ జిల్లాలో క్రిందివిధంగా వినియోగించ బడతాయి.

| | | రూపాయలు. |
|---|---|---|
| 1. | పర్సనల్ అసిస్టెంట్లు, యితర సిబ్బందికి జీతాలు | 8,029 |
| 2. | సంచార ప్రచార వ్యానులకు పెట్రోలు, యితర ఖర్చులకు... | 2,400 |
| 3. | జిల్లా స్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలో పాల్గొనేటందుకు... | 250 |
| 4. | సంగీత నాటకోత్సవాలు ఏర్పాటుచేయడానికి | 500 |
| 5. | జిల్లా, తాలూకా కేంద్రాలలో ప్రణాళికా వారోత్సవాలు ఏర్పాటు చేయటానికి | 900 |
| 6. | జిల్లాలో పనిచేస్తున్న బుర్రకథ దళాల నిర్వహణకు. | 1,520 |
| 7. | సంచార వ్యానులకు పరికరాలు. | 5,000 |
| | మొత్తం | 18,599 |

## అర్థగణాంక శాఖ

1959—60 లో యీ జిల్లాలో ఒక జిల్లా గణాంకశాఖ ఏర్పాటు చేయబడుతుంది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్వెస్టిగేటరు, ఒక అప్పరు డివిజనుగుమాస్తా, ఇద్దరు జవానులు యిందులో

నియమించబడతారు. జిల్లాస్థాయిలో రాజ్యంయొక్క గణాంక సేకరణ కార్యక్రమాలను సమన్వయ పరచటానికి, సేకరించబడి సంకలనం చేయబడే గణాంక వివరాలలో లోపాలులేకుండా ఉండేటట్టుచేయటానికి "లయజన్ ఏజెన్సీ"గా జిల్లా గణాంక విభాగం పనిచేస్తుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.10 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది.

## తంతి, తపాలా సౌకర్యాలు

1959—60లో 40 తపాలా ఆఫీసులను స్థాపించటానికి, ఇంతేకాక ఆరు టెలిగ్రాఫ్ (కంబైండు) ఆఫీసులను ఉల్లాల, రుద్రవరం, తాడిపత్రిఎక్స్‌టెన్షన్, గూడూరు, కోడుమూరు, కంబమూరులలో ఏర్పాటుచేయటానికి ప్రతిపాదింపబడింది. ఇంతేకాక ఎమ్మిగనూరులో ఒక టెలిఫోను ఎక్స్ఛేంజి, కోయిలకుంట్ల, అళ్ళగడ్డ, రాయచోటి ఆత్మకూరు, ఎమ్మిగనూరు, ఆలూరు, కొస్గిలలో 7 పబ్లిక్‌కాల్ ఆఫీసులను ఏర్పాటు చేయటానికికూడ ప్రతిపాదింపబడింది.

## రైలు మార్గాలు

కర్నూలు జిల్లా లో రైలుమార్గాలకు సంబంధించి 1959—60లో క్రింది కార్యక్రమం అమలు జరుప బడుతుంది.

| వరుస సంఖ్య | పనివివరం | అంచనా వేయబడినఖర్చు (వేలరూపాయలలో) |
|---|---|---|
| 1. | నంద్యాలలో 50 రైలు పెట్టెలు పట్టేవిధంగా లూపు లైనును అదనంగా నిర్మించటం .. | 154 |
| 2. | సోమదేవిపల్లి — కంభంల మధ్య క్రొత్త క్రాసింగు స్టేషనును ఏర్పాటుచేయటం .... | 297 |

## కర్నూలు జిల్లా ప్రణాళిక, అభివృద్ధిసంఘం సభ్యుల జాబితా

### అధికార సభ్యులు

1. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, పి డబ్ల్యు.డి., కర్నూలుడివిజన్, నంద్యాల
2. డివిజనల్ ఇంజనీరు, స్పెషల్ డివిజన్, కర్నూలు

3. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, పి.డబ్ల్యు.డి., స్పెషల్ డివిజన్, కర్నూలు
4. జిల్లా వ్యవసాయశాఖాధికారి, కర్నూలు
5. సహకారసంఘాల డిప్యూటిరిజిస్ట్రారు, నంద్యాల
6. సహకారసంఘాల డిప్యూటి రిజిస్ట్రారు, ఆదోని
7. సహకారసంఘాల డిప్యూటి రిజిస్ట్రారు. కర్నూలు
8. జిల్లా వైద్యశాఖాధికారి. కర్నూలు
9. జిల్లా పశు వైద్యశాఖాధికారి, కర్నూలు
10. జిల్లా ఆరోగ్యశాఖాధికారి, కర్నూలు
11. డివిజనల్ ఇంజనీరు, (రహదారులు), కర్నూలు
12. డివిజనల్ ఇంజనీరు, (విద్యుచ్ఛక్తి), కర్నూలు
13. జిల్లా విద్యాశాఖాధికారి. కర్నూలు
14. జిల్లా పంచాయతి ఆఫీసరు, కర్నూలు
15. పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు, కర్నూలు
16. జిల్లా సంక్షేమశాఖాధికారి, కర్నూలు
17. జిల్లా పోలీసు సూపరింటెండెంటు, కర్నూలు
18. జిల్లా పోలీసు సూపరింటెండెంటు, నంద్యాల
19. అసిస్టెంటు ఇంజనీరు, ప్లానింగు, కర్నూలు
20. అసిస్టెంటు ఉమన్ వెల్‌ఫేర్ ఆఫీసరు, కర్నూలు
21. అసిస్టెంటు రేడియో ఇంజనీరు, కర్నూలు
22. జిల్లా అటవీశాఖాధికారి, కర్నూలు
23. జిల్లా అటవీశాఖాధికారి, నంద్యాల
24. జిల్లా అటవీశాఖాధికారి, గిద్దలూరు
25. సబ్-కలెక్టరు, నంద్యాల
26. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, ఆదోని

27. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, కర్నూలు
28. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, మార్కాపూరు
29. అదనపు జిల్లా సంక్షేమశాఖాధికారి, కర్నూలు
30. జిల్లా విద్యాశాఖాధికారి, ఆదోని
31. పబ్లిసిటీ అసిస్టెంటు, కలెక్టరు ఆఫీసు, కర్నూలు
32. ప్రత్యేక జిల్లా వ్యవసాయ శాఖాధికారి, తుంగభద్ర ప్రాజెక్టు, ఆదోని
33. జిల్లా సాంఘిక విద్యాధికారి, కర్నూలు
34. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, ప్రజారోగ్యశాఖ, (ఎన్.ఆర్.డబ్ల్యు.ఎస్) కర్నూలు
35. అదనపు జిల్లా పంచాయతి ఆఫీసరు, నంద్యాల
36. డివిజనల్ పంచాయతి ఆఫీసరు, కర్నూలు
37. స్పెషల్ డిప్యూటి కలెక్టరు, తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతం, కర్నూలు
38. ప్రత్యేక జిల్లా పశువైద్యశాఖాధికారి, ఆదోని
39. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, పి. డబ్ల్యు. డి. తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతం, ఆదోని
40. ఇనస్పెక్టర్ ఆఫ్ ఫిషరీస్, కర్నూలు
41. సూపరింటెండెంటు, అగ్రికల్చరల్ డెమాన్‌స్ట్రేషన్ కమ్ రీసెర్చి స్టేషన్, ఎమ్మిగనూరు
42. సూపరింటెండెంటు, పశుపోషక-పాడి క్షేత్రం, ఎమ్మిగ రు

## లోక్‌సభ, రాజ్యసభ సభ్యులు

1. శ్రీ ఉస్మాన్ అలీఖాన్, ఎం.పి., భారత్ బిల్డింగ్స్, మౌంటురోడ్డు, మద్రాస్

2. శ్రీ కొండకంటి వెంకటసుబ్బయ్య, ఎం.పి., నందికొట్కూరు. కోయిలకుంట్ల

3. శ్రీ చెగిరెడ్డి బాలిరెడ్డి, ఎం. పి., కంభం

4 శ్రీ మునుముల శ్రీనివాసమ్యూల్, రాజ్య సభ సభ్యుడు, గిద్దలూరు

## జి ల్లోని విధాన సభా సభ్యులు

1. శ్రీ బి పి. శేషారెడ్డి, ఎం.ఎల్.ఎ., & జిల్లా ప్రణాళిక, అభివృద్ధి సంఘం ఉపాధ్యక్షుడు, బేతంచెర్ల

2. శ్రీ బి. వి. సుబ్బారెడ్డి ఎం ఎల్.ఎ., కోయిలకుంట్ల

3 శ్రీ ఎస్. కె. లింగం, ఎం.ఎల్.ఎ., హరిజన హాస్టలు కర్నూలు

4. శ్రీ పి. రంగారెడ్డి, ఎం ఎల్.ఎ., ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు, హైదరాబాదు

5. శ్రీ ఇ. అయ్యపురెడ్డి, బి ఎ , బి.ఎల్., ఎం.ఎల్.ఎ., కర్నూలు

6. శ్రీ మహబూబ్ అలీఖాన్, ఎం. ఎల్. ఎ. కర్నూలు

7. శ్రీ ఎన్. వెంకటయ్య, బి ఎ. ఎ. ఆర్. టి. జి, (గ్లాస్గో) ఎం.ఎ.ల్.ఎ. వుయ్యూరు (వయా) విజయవాడ

8. శ్రీ సి. పి. తిమ్మారెడ్డి, ఎం. ఎల్. ఎ., ఆళ్ళగడ్డ

9 శ్రీ లక్ష్మీనారాయణ రెడ్డి, ఎం. ఎల్. ఎ., హోసూరు, పత్తికొండ తాలూకా

10. శ్రీ కె. విజయభాస్కర రెడ్డి, బి. ఎ. బి. ఎల్., ఎం.ఎల్.ఎ. కర్నూలు

11. శ్రీ హెచ్. రామలింగారెడ్డి, బి. ఎ. బి. ఎల్. ఎం.ఎల్.ఎ. ఆదోని

12. శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి, ఎం. ఎల్. ఎ. ఆదోని

13. శ్రీ [illegible], ఎం. ఎల్. ఎ., ఆదోని

14. శ్రీ కె. ఓబులరెడ్డి, ఎం. ఎల్. ఎ. స్పెషల్ క్వార్టర్సు, హిమాయత్ నగరు, హైదరాబాదు

15. శ్రీ జి. వెంకటరెడ్డి, బి. ఎ. బి, ఎల్., ఎం. ఎల్. ఎ., నంద్యాల

## జిల్లాలోని విధాన మండలి సభ్యులు

1. శ్రీ డి. పాండురంగారెడ్డి, ఎం. ఎల్. సి., గిద్దలూరు.
2. శ్రీ ఎన్. వెంకట సుబ్బయ్య. ఎం. ఎల్. సి., నంద్యాల
3. శ్రీ చిన్నశివారెడ్డి, ఎం. ఎల్. సి., గార్గేయపురం
4. శ్రీ ఎం. సుబ్బారెడ్డి. ఎం. ఎల్. సి., జి[illegible] కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు, బ్రాహ్మణ కొట్కూరు, నందికొట్కూరు తాలూక
5. శ్రీ పి. వి. సుబ్బాశాస్త్రి, ఎం. ఎల్. సి., 441/153, ప్రకాశ్ నగరు, కర్నూలు
6. కర్నూలుజిల్లా బోర్డు స్పెషలు ఆఫీసరుయొక్క పర్సనల్ అసిస్టెంటు.

## జిల్లాలోని పురపాలక సంఘాల అధ్యక్షులు

1. ఆదోని పురపాలక సంఘం అధ్యక్షుడు
2. కర్నూలు పురపాలక సంఘం అధ్యక్షుడు
3. నంద్యాల పురపాలక సంఘం అధ్యక్షుడు

## జిల్లాలోని బ్లాక్ డెవలప్‌మెంటు కమిటీల అధ్యక్షులు

1. డాక్టరు ఎం. శామ్యూల్, ఆళ్ళగడ్డ
2. శ్రీ జి. మహానందిరెడ్డి, నంద్యాల
3. శ్రీ కె. వేణుగోపాలరెడ్డి, బ్లాకు సమితి అధ్యక్షుడు, కోడుమూరు
4. శ్రీ హెచ్. పి. వీరారెడ్డి, హర్దగెరి, ఆలూరు తాలూకా
5. శ్రీ ఎస్. పురుషోత్తమరెడ్డి, నగరూరు, ఆలూరు తాలూక

## బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసర్లు

1. బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు, ఎఱ్ఱగొండపాలెం
2. ,, గిద్దలూరు
3. ,, కర్నూలు
4. ,, దేవనకొండ
5. ,, బెస్తవారపేట
6. ,, కోడుమూరు
7. ,, సంజామల
8. ,, కొమరోలు
9. ,, నందికొట్కూరు
10. ,, నంద్యాల
11. ,, ఎం. వి. నగరు
12. ,, రుద్రవరం
13. ,, ద్రోణాచలం
14. ,, ఆలూరు
15. ,, ఎమ్మిగనూరు
16. ,, కోస్గి
17 ,, ఆదోని
18. ,, ఆస్పరి

## అనధికార సభ్యులు

1. శ్రీ పి. వెంకటకృష్ణారెడ్డి, పగిడ్యాల, నందికొట్కూరు తాలూక
2. శ్రీ ఎం. రామచంద్రారెడ్డి, వెల్దుర్తి, ద్రోణాచలం తాలూకా

3. శ్రీ పి. గోవిందదాస్, ఆలూరు

4. శ్రీ కె. వి. నారాయణప్ప, బి.ఎ., బి.ఎల్., అడ్వకేటు, కర్నూలు

5 శ్రీ ఎక్కాలి రామయ్య, ఎఱ్ఱగొండపాలెం

6 డాక్టరు పి. పుల్లారెడ్డి, ఆళ్ళగడ్డ

7. శ్రీ మహబూబ్ బేగ్, మార్కాపురం

8. శ్రీ పి. విరూపాక్షరెడ్డి. అస్పరి, ఆలూరు తాలూక

9. శ్రీ అబ్దుల్ గనిఖాన్, పట్టణ కాంగ్రెసు అధ్యక్షుడు, రీనల్ దార్ స్ట్రీట్, మసుంబాష దర్గావద్ద, కర్నూలు

10. శ్రీ మట్టా వెంకట సుబ్బయ్య గుప్త, బెస్తవారపేట

11. శ్రీ ఎం. భీమారావు, నందవరం, ఆదోని తాలూక

12. శ్రీ ఎం. అంకిరెడ్డి, పెరుసోములగ్రామం, కోయిలకుంట్ల తాలూక

13. శ్రీ పిడతల నారాయణరెడ్డి, సలకలవీడు, కంభం తాలూక

14. మిస్‌స్‌జాన్, కర్నూలు

15. శ్రీ ఎం. రమణ, ఎం. జి. బ్రదర్స్, ఎమ్మిగనూరు, ఆదోని తాలూక

16. శ్రీ కోడి నరసింహులు, నంద్యాల

17. శ్రీ జి. రామసుబ్బారెడ్డి, విట్టలాపురం, బనగానపల్లె సబ్ తాలూక

18. శ్రీ గుండం వెంకటరెడ్డి, ఫోర్టు, నంద్యాల

19. కర్నూలు జిల్లా సహకారబ్యాంకు అధ్యక్షుడు

20. శ్రీ ఎం. లక్ష్మిరెడ్డి, అడ్వకేటు, బనగానపల్లె.

21. శ్రీ రామలింగయ్య, మునిసిపల్ కౌన్సిలర్

22. శ్రీ కె. ఆర్. హనుమంతరెడ్డి, పెద్దతరహా సంఘం అధ్యక్షుడు, హాలహర్వి. ఎమ్మిగనూరు సబ్ తాలూక

23. శ్రీ పి. ఒ. సత్యనారాయణరాజు, పంచాయితి బోర్డు అధ్యక్షుడు, కోస్గి

24. శ్రీ హెచ్. వెంకటేశ్వరరావు, ఆదోని

25. శ్రీ ఎ. సి. పాపయ్య చౌదురి, రామదుర్గం, ఆలూరు తాలూక

26. శ్రీ పి. వీరన్న గౌడు, హొళగుండి, ఆలూరుతాలూక

27. శ్రీ బి. రంగనాథగౌడ్, బదినేహాల్, ఆదోనితాలూక

28. శ్రీ ఎం. లక్ష్మీకాంతరెడ్డి; ల్యాండ్ లార్డ్, మలగవేలి, ఆలూరు తాలూక

29. శ్రీ రామేశ్వరరావు, ఆదోని

30. శ్రీ ఎం. శివన్న, ఎమ్మిగనూరు సబ్ తాలూక

